# ந சுப்பு ரெட்டியார் 100

## Na Subbu Reddiar 100 Educational Trust

[An ISO 9001 - 2015 Certified]

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~



All Four books [Telugu, Malayalam, Kannada & Tulu], translated by **Dravidian University** were formally released during the Silver Jubilee of the University on **20 October 2022**.
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

நான்கு திராவிட மொழிகளில்

# குயில் பாட்டு ஒரு மதிப்பீடு

(பாரதியார் நூற்றாண்டு வெளியீடு)



பேராசிரியர் முனைவர்
ந சுப்பு ரெட்டியார்

மொழிபெயர்ப்பு : திராவிடப் பல்கலைக்கழகம்

**కోయిల పాట**
ఒక మూల్యనిర్ధారణ
**Telugu**
**ISBN: 978-81-948697-3-3**

**ಕೋಗಿಲೆ ಹಾಡು**
ಒಂದು ಮೌಲ್ಯನಿರ್ಣಯ
**Kannada**
**ISBN: 978-81-948697-1-9**

**കുയിൽ പാട്ട്**
ഒരു വിലയിരുത്തൽ
**Malayalam**
**ISBN: 978-81-948697-2-6**

**ಕೋಗಿಲೆ ಪದ: ಒಂಜಿ ಪೊಲಬು**
**Tulu**
**ISBN: 978-81-948697-2-0**

**Na Subbu Reddiar 100 Educational Trust**
**Centenary Committee Publications**

Prof Dr N Subbu Reddiar had published "குயில் பாட்டு – ஒரு மதிப்பீடு" in 1982, during the Centenary Year of Mahakavi Subramaniya Bharathiyar.

This TELUGU translation
"Koyila Paata:
Oka Mulya Nirdharana"
has been rendered by:
Ms CE Gayatri Devi
Classical Telugu Centre
Saraswathi Nagar
Venkatachalam
**NELLORE – 524 320**

This KANNADA translation
"Kokile Haadu :
Ondu Moulya Nirnaya "
has been rendered by:
Dr Jayalalitha
Associate Professor
Dept of Kannada & Translation Studies,
Dravidian University,
**KUPPAM—517 426**,
Andhra Pradesh

This MALAYALAM translation
"**Koyil Pattu:
Oru Vilayiruthal**"
has been rendered by:
Dr Sushma Shankar
Editor:**Thodalnudi**
Immadihalli Road,
Whitefield,
**BENGALURU - 560 066**

This TULU translation
"**Kogile Pada :
Onji Polabu**"
has been rendered by:
Dr MS Durga Praveena
Dept of Kannada & Translation Studies,
Dravidian University,
**KUPPAM—517 426**,
Andhra Pradesh






# కోయిల పాట

## ఒక మూల్యనిర్ధారణ

(భారతియార్ శతజయంతి సంచిక : 1982)

ఆచార్య డాక్టర్
న సుబ్బురెడ్డియార్

తెలుగు అనువాదం
శ్రీమతి చెరుకూరి గాయత్రీదేవి




NA SUBBUREDDIAR 100 EDUCATIONAL TRUST
Centenary Committee Publications

# కోయిల పాట

## ఒక మూల్యనిర్ధారణ

(భారతియార్ శతజయంతి సంచిక : 1982)

ఆచార్య డాక్టర్

న సుబ్బురెడ్డియార్

తెలుగు అనువాదం

శ్రీమతి చెరుకూరి గాయత్రీదేవి

NA SUBBUREDDIAR 100 EDUCATIONAL TRUST

Centenary Committee Publications

## రసికమణి టి.కె.సి. గారికి

## ప్రేమతో అంకితం

*పవిత్ర కుట్రాల జలపాత సుఖాన్ని*
*నూతన మధువుగా చేసి ఆ మధువును*
*తీయని మంచి అమృతంగా మార్చి మంచి తమిళంలో*
*ఆనందమే సౌరభంగా కలగలిపిన*
*దివ్యమైన కళాకారుడు; రసజ్ఞతయే రూపుదాల్చిన*
*మంచి హృదయం కలిగిన నిజమైన జ్ఞాని;*
*మధురమైన ఫలాలను కురిపించే నెచ్చెలి, మా టి.కె.సి.*
*గారికి ఈ గ్రంథం సమర్పణం: మంగళం!*

# ముందుమాటలు

## (ఆచార్య - డాక్టర్. ఇరా. కు. నాగు)

ఇరవయ్యో శతాబ్దపు సాటిలేని మహాకవిగా లెక్కించదగినవారు సుబ్రహ్మణ్యభారతి. తమ కవితాశక్తిచే ఈ ప్రపంచాన్ని శాసించడానికి ప్రయత్నించారు. దేశాభిమానాన్ని, భాషాభిమానాన్ని, మానవత్వాన్ని, సార్వత్రికతను తన పాటలకు ఇతివృత్తంగా చేసుకొని ఆ మహాకవి తమిళభాషకు విశ్వదృష్టిని అందించారు. వారి పుట్టుక కారణంగా తమిళం సముద్ధరింపబడింది. నవ నవోన్మేషములైన, కాంతివంతములైన కవితలను తమిళానికి ప్రసాదించి తమిళాన్ని బలోపేతం చేశారు. ఆ మహాకవి రచనలన్నీ ఉన్నతములైనవే. అయినప్పటికీ ప్రముఖంగా పేర్కొనదగినవి మూడు ఉన్నాయి; మహాభారతంలో 'భారతాన్ని' గుర్తుకు తెచ్చే "పాంచాలీ శపథం" ఒకటి; శ్రీకృష్ణుని కాలి అందెలకు పరవశులయ్యేవారిని స్మరించి స్తుతించే రాగభరితమైన 'కణ్ణన్ పాట్టు' మరొకటి; ఆధునిక కవితా వ్యామోహంతో, సాయంసంధ్య అందాలకు మైమరచి హృదయంలో పెల్లుబికిన కల్పనా సామర్థ్యంచే పుట్టిన 'కుయిల్‌పాట్టు' (కోయిలపాట) మరొకటి. ఈ మూడింటిలో 'కుయిల్ పాట్టు'(కోయిలపాట)కు ఒక ప్రత్యేకత ఉంది. దాని అందాలకు పరవశుడు కాని తమిళుడే లేడని చెప్పవచ్చు. "కోయిలపాటలో – ప్రేమ, పెల్లుబుకుతోందిరా, చేష్టలు మరిచాను రా, – లాహిరి తలకెక్కింది రా" అని ప్రశంసించాడు కవిమణి. కవితాభరితమైన ఆ కోయిలపాట అందాలకు తమ హృదయాలను ధారపోసుకొన్న

విద్వాంసులలో ఆచార్య డాక్టర్ న. సుబ్బురెడ్డియార్ గారు ఒకరు. కోయిలపాటలోని అంతులేని అందాలకు హృదయం ధారపోసుకొన్న రెడ్డిగారు, 'కోయిలపాట' అందాలన్నింటినీ సేకరించి గ్రంథంగా తమిళ సాహిత్యాభిమానులకు అందించారు. తగిన సమయంలో ఈ చక్కని గ్రంథాన్ని తమిళ ప్రజలకు అందించారు రెడ్డిగారు. మహాకవి భారతిగారి గొప్పదనం రాష్ట్రమంతా తెలియజేయాలనే ఉద్దేశంతో తమిళ ప్రభుత్వం సభాకార్యక్రమాలు నిర్వహించి ప్రపంచానికంతా తెలియజేసే ఈ శుభ సమయంలో ఆచార్యులు తమిళదేశానికి అందించిన ఈ గ్రంథం భారతియార్ అభిమానుల ఆదరాభిమానాలకు పాత్రమవుతుంది.

ఆచార్య డా॥ సుబ్బురెడ్డిగారు గొప్ప సాహితీవేత్త. విజ్ఞానంతో పాటు సాహిత్యమూ, కళలు మొదలైన రంగాల్లో అనుభవము కలిగినవారు. అసంఖ్యాకములైన సాహిత్య గ్రంథాలతో పరిచయమూ, చక్కని రచనలు చేసే సామర్థ్యమూ కలిగినవారు. ఆచార్య రెడ్డిగారు మహాకవి భారతిగారి శత జయంతి మహోత్సవ స్మృత్యంజలిగా కొన్ని గ్రంథాలను రచించి వెలువరించారు. వాటిల్లో ఒకటైన కుయిల్ పాట్టు(కోయిలపాట)కు సంబంధించింది ఈ గ్రంథం.

ఈ గ్రంథంలో ఎనిమిది అధ్యాయాలున్నాయి. వైష్ణవులకు ప్రీతి పాత్రమైన సంఖ్య ఎనిమిది. ఆళ్వారుల పాశురాలలో మితిలేని భక్తి కలిగిన ఆచార్య రెడ్డిగారికి 'ఎనిమిది' ప్రీతికరం కావడంలో ఆశ్చర్యం ఏమీ లేదు కదా! పరిశోధనారంగంలో ఎన్నోగ్రంథాలను రచించిన అనుభవజ్ఞులు ఆచార్య రెడ్డిగారు. ఆ పద్ధతినే ఈ గ్రంథంలో సమర్థవంతంగా నిర్వహించారు. "పాటయొక్క నేపథ్యం" అని ప్రారంభమయ్యే మొదటి అధ్యాయం శీర్షికే

పరిశోధన పద్ధతిని అనుసరించిందని చెప్పడానికి ఒక చక్కని ఉదాహరణ అవుతుంది. "కోకిలపాట ఒక మూల్యనిర్ధారణ" అని ముగిసే చివరి అధ్యాయాన్ని కూడ ఆచార్యులవారు పరిశోధనా దృష్టితో విశ్లేషించారు అని చెప్పడానికి మరొక ఉదాహరణ.

ఈ గ్రంథంలో విశిష్టమైన భాగాలను వివరించి చెప్పే సందర్భాల్లో స్వతంత్రమైన ఉపమానాలను ప్రయోగించడం ప్రశంసింపదగిన విషయం. ''కోయిలపాట'' కవిగారి చెవిలో పడగా, పడగా ప్రేమపైత్యం ఇనుమడించిపోతూ ఉందట. దాని గురించి చెప్పే సందర్భంలో వారికే ఉ చితమైన ప్రత్యేకబాణిలో "వాయుపీడనం ఉన్న నాళికలో పాదరసం పైపైకి ఉబుకుతున్నట్లు పెరుగుతూ ఉంది"(పుట.2) అని రాశారు. మరొక చోట ప్రకృతికి కవికి మధ్య ఉన్న సన్నిహితమైన సంబంధాన్ని పేర్కొని వివరించే సందర్భంలో "నిద్రపోతున్న తల్లి బిడ్డను కౌగలించుకొని ఉన్నట్లు"(పుట.41) అని రాశారు. ఈ ఉపమానాన్ని చదువుతున్నపుడు శ్రీకృష్ణుని తన హృదయంలో నిలుపుకొన్న పెరియాళ్వారులు గుర్తుకు వస్తారు. పత్తుప్పాట్టు, ఎట్టుత్తొగై గ్రంథాలలో వచ్చే ఉపమానాలను, భారతి ప్రయోగించిన ఉపమానాలను తులనాత్మకంగా పేర్కొనే సందర్భంలో ఆచార్య రెడ్డిగారు ప్రయోగించిన ఉపమానాలు సంగకాలం నాటి గేయాలకు హృదయాన్ని ధారపోసుకొన్న నాలాంటి వారికి ప్రీతిపాత్రంగా లేదు.

'కోయిలపాట' చదివేవాళ్లకు అలసటే ఉండదు. అదేవిధంగా 'కోయిలపాట'ను గురించి ఆచార్య రెడ్డిగారు రచించిన ఈ గ్రంథం కూడ వేసట కలిగించదు. ప్రాచీన తమిళ సాహిత్యం మొదలుకొని, 'ఆధునిక తమిళ' సాహిత్యం వరకు భారతియార్ క్షుణ్ణంగా అధ్యయనం చేసి

ఉన్నారని ఈ గ్రంథం మనకు తెలియజేస్తోంది. 'కోయిలపాట'లో పేర్కొనబడిన 'ప్రేమరీతులు' చాలావరకు సంప్రదాయ సాహిత్యానికి చెందినవే అని వారు నిరూపించే సందర్భాలు తగిన సాక్ష్యాధారాలు అవుతున్నాయి. భారతి – ఎవరు? అని చెప్పడానికి వచ్చే కవి వాలిగారి గేయాన్ని పేర్కొనే సందర్భంలో(పుట.97) ఆధునిక తమిళం అభ్యసించిన వాసనలు గుబాళిస్తాయి. సంగీతం యొక్క గొప్పదనం వివరించే సందర్భాల్లో కొత్త పాతలను అనుసంధానించిన తీరు చూసి ఆనందించవచ్చు.

'కవిత అంతరార్థం' అనే ఏడవ అధ్యాయంలో ఆచార్య రెడ్డిగారి పరిశోధనా దృక్పథం స్పష్టంగా తెలియవస్తుంది. వారి ప్రతిభా పాండిత్యాలు అక్కడ వ్యక్తమవుతాయి. కోకిలను జీవాత్మగాను, కవిని పరమాత్మగాను భావించే చోటు, కోయిల చివరగా కవిచేతుల్లో పడడం "శరణాగతి" ద్వారా పరమ పురుషునిలో లీనం అయినట్లు అని నిరూపించి చెప్పే సందర్భమూ చాలా చక్కగా ఉన్నాయి. "ఊహించి చెప్పే అంతరార్థం" అనే ఉపశీర్షికలో వారు పేర్కొన్న అంశాలు పండితులైనవారికి కలకండ వలె మధురములైనవి.

ఈ గ్రంథం ఎనిమిదో అధ్యాయం కోయిలపాటలోని సాహిత్యాంశాలను ప్రస్తావిస్తుంది. ఈ అధ్యాయంలో పేర్కొనబడినవన్నీ సరియైనవే అని ప్రశంసించక పోయినప్పటికీ వద్దని తోసి వేయడానికి వీలుకానివి వాటిల్లో ఉందనే చెప్పాలి. "ఒకరకమైన" రచనాభినివేశమే దానికి కారణం.

భారతి అనే మహాకవి పుట్టినందువల్ల తమిళనాడు ప్రసిద్ధి చెందింది. వారివల్ల తమిళభాష అగ్రస్థానాన్ని అందుకొంది. ఆ తమిళకవి స్పృశించని అంశమంటూ ఏదీలేదు. తాకినవన్నింటినీ అందాలతో

జ్వాజ్వల్యమానం చేయకుండా వదల్లేదు. ఆ మహాకవి కవితా లోతులను తెలుసుకోవడానికి అసాధ్యమైన సముద్రం. ఆ మహాసముద్రంలో ఉత్సాహమున్న సాహితీప్రియులందరూ ఈది ఆనందించవచ్చు. వారి ప్రతిభా పాండిత్యాల మేరకు ఆడి పరవశించవచ్చు. ఆడుకొని పరవశించడమే కాదు కొల్లలుగా ముత్యాలను తీసుకువచ్చి ఆభరణాలుగా కూర్చవచ్చు. ఆ మహాకవి కవితా మహాసముద్రంలో ఈదులాడి పరవశించి, ముత్యాలను తీసుకువచ్చి అందమైన తమిళ హారాలను ధరించిన పండితులలో ఆచార్య రెడ్డిగారు పేర్కొనదగినవారు. తమిళభాష ద్వారా ప్రపంచఖ్యాతి నార్జించిన ఆచార్య రెడ్డిగారి తమిళభాషా సాహిత్య కార్యక్రమం మున్ముందు ఎంతో ఘనంగా జరగాలి. ఛందోబద్ధమైన తమిళాన్ని, సంగీత తమిళంగా మార్చి వ్యాసాలుగా రూపొందించి సేవలు చేస్తున్న ఆచార్య రెడ్డిగారి తమిళ సాహిత్య సేవలు అభివృద్ధి చెందాలి. పెక్కు సంవత్సరాలు పేరు ప్రఖ్యాతులతో వారు చల్లగా జీవనం సాగించాలని సర్వ సమర్థుడైన ఆ భగవంతుని కరుణా కటాక్షాలను అర్థిస్తున్నాను.

విశిష్టమైన తమిళభాష వర్థిల్లాలి !

సజ్జనులైన తమిళులు వర్థిల్లాలి!!

భారతదేశం వర్థిల్లాలి !!!

చెన్నై - 600 005 **ఇరా. కు. నాగు**

22-11-1982 ఆచార్యులు - ప్రెసిడెన్సీ కాలేజీ.

# గ్రంథ ప్రస్తావన

రావాలి నెమలి మీద

వేలాయుధంతో రావాలి

ఇవ్వాలి ఆరోగ్యమూ, పేరు ప్రఖ్యాతులూ

తపమూ, సామర్థ్యమూ, ధనమూ, గౌరవమూ

ఓ మురుగా! మురుగా! మురుగా!

*– భారతియార్*

సుబ్రహ్మణ్యభారతిగారి కల్పనా శక్తి సాధారణమైనది కాదు. తమ కల్పనలో ఉపమానాలు, ఊహా కల్పనలు, దృశ్య చిత్రీకరణలు(Imagery), ప్రతీకలు(Symbol) మొదలైనవాటిని మిళితం గావించి వారు తమ కవితలను మనోహరంగా తీర్చిదిద్దారు. వారి రచనలు విస్తరింపబడిన రూపాలను కలిగిన గ్రంథాలు.వీటిలో "జ్ఞానరథం" వచన గ్రంథానికి, కుయిల్‌పాట్టు (కోయిలపాట) కథాకవ్యానికి ఉదాహరణలు. వీటిలో 'కుయిల్‌పాట్టు' కల్పనతో జోడింపబడిన అందమైన సజీవమైన కరుణారసభరితమైన పారదర్శకమైన వస్తువును కలిగిన ఒక కోయిలకు సంబంధించిన కథ. ఈ కథను వేదాంతపరంగా విస్తరింపజేయడానికి అవకాశముంది.

---

1. తొ. పా. మురుగన్ పాట్టు – 1

భారతిగారి ముచ్చటైన మూడు సాహిత్య గ్రంథాలుగా భావింపబడే కణ్ణన్‌పాట్టు(కృష్ణునిపాట), పాంచాలి శపథం[2], కుయిల్‌పాట్టు(కోయిలపాట) ఈ మూడింటిలో చివరగా పేర్కొనబడిన కుయిల్‌పాట్టు మిక్కిలి శ్రేష్ఠమైనదిగా పలువురు భావించారు. ఒక కవితను ఆస్వాదించి చెబుతున్నవారి అంశాలన్నీ వాళ్ల వాళ్ల భావావేశాలకు చెందినవిగానే ఉంటాయని అనుకుంటే ఈ సమిష్టివాదానికి అవకాశమివ్వదు. పలు సంవత్సరాలుగా నేను ఈ కవితను ఆస్వాదిస్తున్నప్పుడు పెల్లుబుకిన నా భావాలు "భారతిగారి శతజయంతి" సందర్భంలో గ్రంథరూపం దాల్చి తమిళదేశంలో సంచరిస్తున్నాయి. భారతిగారి రచనలపై అభిమానం గలవారు నా ఈ చిన్నగ్రంథంపైన కూడా తమ దృష్టిని ప్రసరింపజేస్తారని నా దృఢమైన నమ్మకం. అటువంటి గౌరవం ఈ గ్రంథం పొందగలిగి నట్లయితే అది నా అదృష్టంగా భావిస్తాను.

ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించి, చక్కగా రూపొందించి ఇచ్చిన నావల్ ఆర్ట్ ముద్రణాలయ అధికారులు కవిఙ్ఞర్ తిరు. నారా నాచ్చియప్పన్ గారికి నా కృతజ్ఞతా పూర్వక అభిమానాన్ని తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథానికి 'ముందు మాటలు' రాసి ఇచ్చిన డాక్టర్. ఆర్. కే. నాగు నా సోదరుని లాంటివారు. నేను డాక్టరేట్ డిగ్రీ తీసుకోవడానికి మునుపే డాక్టరేట్ డిగ్రీ అందుకున్నవారు. డా. ము. వరదరాజన్‌గారి ముఖ్యమైన శిష్యులలో ఒకరు. తమిళ సాహిత్య గ్రంథాలను, వ్యాకరణాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన విద్వాంసులు. శిష్యులతో సరళంగా

2. కణ్ణన్ పాట్టుత్తిఱన్, పాంజాలి శపథం : ఒరునోక్కు – అనే ఈ రెండు ఆచార్యుల పుస్తకాలు మదురై సర్వోదయ ఇలక్కియ పణ్ణై, మేల వెళివీధి, మదురై – 625001 వారి ద్వారా ప్రచురింపబడినవి.

మెలగుతున్నప్పటికీ వాళ్లల్లో సత్ప్రవర్తన, సచ్ఛీలత ఉండాలని కోరుకుంటారు. ఈ కాలంలో కూడ విద్యార్థులకు బాధ్యతగా బోధించి వాళ్ల అభిమానాన్ని అందుకుంటున్నారు. ఇలాంటి పెక్కు గుణగణాలను కలిగిన మంచి ఉపాధ్యాయులు ఈ గ్రంథానికి అభిమానంతో 'ముందు మాటలు' రాసినందులకు కృతజ్ఞతా పూర్వకమైన అభిమానాన్ని తెలియజేస్తున్నాను.

రసికమణి టి.కె.సి. చిదంబరనాథ మొదలియార్‌ను (టి.కె.సి.) తెలియనివారు అరుదు. 1949 మార్చి మొదలుకొని వీరు నాకు పరిచయం. ఆ సంవత్సరం కారైక్కుడి కంబన్ ఉత్సవంలోనూ, అమరావతి పుదూర్ మహిళాలయ సంవత్సరాది వేడుకల్లోనూ వారి రెండు ఉపన్యాసాలను విని ఆనందించాను. అంతకు ముందు వీరు రచించిన ఎన్నో గ్రంథాలను, ముఖ్యంగా వీరు ప్రచురించిన రామాయణాన్ని చదివి ఆనందించి ఉన్నాను. రెండు రోజుల పరిచయమే; కవితలను చదివి స్వారస్యం చెందే అలవాటు పెంపొందించుకున్నాను. మాధుర్యాన్ని ఆస్వాదించే అలవాటు రావడం పూర్వజన్మలో సుకృతం చేసుకున్నవారికి మాత్రమే దక్కుతుందని పెద్దలు చెబుతుంటారు. ఈ అలవాటు కలగడం ఎంతో ప్రయత్నం చేతనే సాధ్యమవుతుందని ఇలా చెప్పారు కాబోలు. ఇలాంటి మహనీయులకు ఈ గ్రంథాన్ని ప్రేమతో అంకితం చేసి ఆనందిస్తున్నాను. అమరులైన వీరి ఆశీర్వాదంతో సాహిత్యాలను ఆస్వాదించే అలవాటు ఇంకా ఎంతో అభివృద్ధి చెందుతుందని నా దృఢమైన నమ్మకం.

***పేనా ఒక దైవం, ఈ***
***అక్షరం కూడ ఒక దైవమే.***[3]

---

3. (స్వీయ చరిత్ర – భారతి అరవైయారు – 18)

అని తన సిద్ధాంతాన్ని గట్టిగా చెప్పినవారు భారతియార్. అక్షరం మీద విశ్వాసమున్న వాళ్లందరికీ ఈ సిద్ధాంతం వేదవాక్యంగానే ఉండాలి. ఇలాంటి సిద్ధాంతంలో జీవించిన కవికి తమిళం మాట్లాడే అన్ని ప్రదేశాల్లోనూ శతజయంతి వేడుకలు జరుగుతున్నాయి. "గువ్వకు తగిన రామేశ్వరం" అనే సామెతకు తగినట్లుగా ఈ ఆ మహాకవి గురించి నాలుగు పరిశోధన గ్రంథాలు ప్రచురించి వారి శతజయంతి ఉత్సవాలను వేడుగ్గా జరుపుకుంటున్నాను. మూడింటిని ముద్రణాలయం వారు ప్రచురించారు. దీన్ని నేనే నా బాధ్యతగా ముద్రించి, వెలువరించి ఆనందిస్తున్నాను.

***ఈ సమయంలో భారతిగారి,***
***"చేసే కవిత పరాశక్తి***
***వల్లనే చేయబడు గాక [4]***
***పాటలో చెప్పబడేది***
***ఆమె మాటయే అవుతుంది" [5]***

అనే వాక్యాలను మననం చేసుకుంటున్నాను. భారతియార్ భావించినట్లు ఈ గ్రంథాన్ని నేను రచించి వెలువరించడానికి నా లోపల అంతర్యామిగా ఉన్న శ్రీ వేంకటేశ్వరుడే కారణం. అతడే నన్ను రోగాలు లేనివాడిగా చేసి, సకల శుభాలను అనుగ్రహించి నన్ను రక్షిస్తూ మంచిమార్గంలో ప్రవర్తింప జేస్తున్నాడు. అతన్ని మనసారా, అక్షరరూపంలో భక్తితో నమస్కరిస్తున్నాను.

---

4. వి.నా.మా – 26

5. తొ.పా. పేద్దై నెంజే – 5

*వేలాయుధాన్ని కొలిస్తే విముక్తులవుతాము*
*వేలాయుధుని పాదాలకు నమస్కరిస్తే*
*చింతలు తొలగిపోతాయి.* [6]
*విద్యాబుద్ధులు తనకు తానుగా పొంది*
*శక్తి శక్తి శక్తియని చెబితే అదే సుఖం.*

చెన్నై – 600 040 **న. సుబ్బు రెడ్డియార్**
నవంబర్ 30, 1982

6. పై. విడుదలై వెణ్బా – 4

# విషయ సూచిక

# అధ్యాయం - 1

# పాట నేపథ్యం

ఒకరోజు ఉదయం, తమిళానికి ఆటపట్టు అయిన పుదుచ్చేరి నగరానికి పశ్చిమంగా ఒక మామిడితోట. ఆ తోట భారతిగారి స్నేహితుడు కృష్ణస్వామి శెట్టియారుకు చెందింది. ఆ ప్రదేశానికి భారతియార్ వచ్చారు. వారు వచ్చిన రోజు ఆ తోటకు వేటగాళ్లు రాని పుణ్యదినం. ఆ రోజు ఒక ఆడకోయిల ఒక మామిడిచెట్టు చిటారుకొమ్మన కూర్చొని పాడుతూ ఉంది. ఆ పాటను ఆ తోటలో ఉన్న మగ కోయిలలన్నీ వింటున్నాయి. వాటి శరీరాలు పులకాంకితములై మైమరచి హృదయాలలో ప్రేమాగ్ని అంతకంతకూ వృద్ధి చెందసాగింది. ఆ మధురమైన సంగీతాన్ని తోటలోని పక్షులన్నీ తమ తమ ఉదయపు కాలకృత్యాలు మరిచి పరవశంగా వింటూ తీయని అనుభూతిలో మునిగిపోయాయి.

నాద తరంగాలు మెల్లగా స్పృశించి శరీరమంతా అలుముకున్నట్లు, గగన మోహిని కోయిలరూపం ధరించి విరాజిల్లినట్లు ఆ ఆడ కోయిల పాడే మధురమైన గీతం అమృతమై గాలిలో కలసి అంతటా వ్యాపిస్తూ ఉంది. అప్పుడు అక్కడున్న కవిగారు కూడ

*"పూర్వం కవితావేశం పూని అచేతనలో*
*పట్టపగటి పూట కవిగారికి కనిపించిందట*
*సుదీర్ఘమైన స్వప్నంలోని సంఘటనలో"* [1]

---

1. కుయిల్ పాట్టు : 1, కుయిల్ – పాదాలు (22–24)

ఉద్యానవనంలో చూసిన కన్నె కోకిల సంగీతంలో కవి పరవశమై పోయారు. ప్రేమానుభూతిలో మునిగిపోయారు. ఈ దశలో ఇలా మాట్లాడుతున్నారు:

*"మానవరూపం తొలగిపోయి కోయిలరూపం రాదా?*
*ఇక కోకిలమ్మతో ఎన్నడూ ఎడబాయకుండా*
*ప్రేమిస్తూ కలసిమెలసి ఆనందంగా జీవిద్దామా?*
*నాదామృతంలో మన ప్రాణాలు పోగొట్టుకుందామా?"* [2]

అంటూ కోయిల పాట వీరి చెవుల్లో పడి, కవిగారి ప్రేమావేశం వాయు పీడనం కారణంగా గాజుగొట్టంలోని పాదరసం పైకి ఎక్కినట్లు పెరుగుతూ పోతున్నది. దానికి తగినట్లు కవితావేశం కూడ పెల్లుబుకుతున్నది. ఆ రోజు వారు విన్న ఆ చిన్నారి కోయిల మధురగీతాన్ని దేవతలు కూడ విని ఉండరు.

"ఆ రోజు నేను విన్నది అమరులు విని ఉంటారా?" [3] అని కవిగారే చెప్పడం చూడవచ్చు.

కోయిల ఎలా పాడుతోంది? "కు క్కు క్కూ, కు క్కు క్కూ, కు క్కు క్కూ, కు క్కు క్కూ, కు క్కు క్కూ, కు క్కు క్కూ..." అంటూ. ఈ సంగీతాన్ని వింటున్న కవిగారికి కోయిలపాటలోని వస్తువు

*ప్రేమ ప్రేమ, ప్రేమ*
*ప్రేమ పోతే, ప్రేమపోతే*

---

2. పైదే. పాదాలు – 27 – 30

3. పైదే. పాదాలు – 32

*చావు, చావు, చావు,* [4]

అనీ,

*అనుగ్రహమా, ఒక చక్కటి కాంతిపుంజమా,*
*కాంతులు తొలగిపోతే, కాంతులు తొలగిపోతే*
*అంధకారమే, అంధకారమే, అంధకారమే*

అంటూ ఎన్నోరకాలుగా విస్తరింపబడుతుంది. నా ప్రియమైన ఆచార్యులు శ్రీ శేషయ్యగారు (కెమిస్ట్రీ ప్రొఫెసర్. సెయింట్ జోసెఫ్ కాలేజి, తిరుచ్చి) కు క్కు క్కూ, కు క్కు క్కూ, కు క్కు క్కూ, కు క్కు క్కూ... అంటూ కోయిల పిలిచినట్లు తన గొంతును పెంచి, దాని తరువాత–

*ప్రేమ, ప్రేమ, ప్రేమ*
*ప్రేమపోతే, ప్రేమపోతే*
*చావే, చావే, చావే.*

అనే పాదాలను, దీనిని అనుసరించి వచ్చే తొమ్మిది పాదాలను "కు క్కు క్కూ" అనే శబ్దం వచ్చేలాగ కోయిల పిలిచినట్లు తాను పాడి ఆనందించడమూ, వింటున్నవారిని కూడా ఆనందింప జేయడమూ నేను ప్రత్యక్షంగా చూసి ఆనందించి ఉన్నాను[5]. వారు పాడే పద్ధతిలో పాడగలిగిన వాళ్లు పాడి నేర్చుకోవాలనే ఆసక్తి ఉన్నవారు కోయిలపాటను పాడి అనుభవించవచ్చు. ఈ కోయిల కథనే కవిగారు తమ 'కోయిల పాట'లో విస్తరించి చెప్పారు. "కు క్కు క్కూ, కు క్కు క్కూ... అనే కోయిల పాటే

---

4. కుయిల్ పాట్టు : 2
5. 1934 – 39లో నేను తిరుచ్చి పవిత్ర సూసైయప్పర్ కాలేజిలో కెమిస్ట్రీ చదివి, బి.యస్సీ. పట్టం అందుకొన్న విద్యార్థులు.

కవిగారి ఆలోచనల్లో నిలిచి, ఆలోచనల్లో పుష్పించి, 'కోయిల పాట" అనే కవితగా ఆకారం దాల్చింది. ఈ నేపథ్యం తెలుసుకొని కోయిల పాటను చదివి అనుభవించాలి.

*"కోయిల పాట'లో – ప్రేమ*
*పెల్లుబుకుతోందిరా,*
*చేష్టలుడిగానురా –*
*మత్తు తల కెక్కిందిరా?"* [6]

అని ఒక పల్లెటూరివాడు భారతిపాటను రాగంగా పాడడం విన్నందువల్ల పొందిన అనుభవాన్ని మనమూ పొందడానికి ప్రయత్నించుదాం. అప్పుడే 'కవిత అనుభవం' ఇదీ అనేది మన మనసుకు అర్థమవుతుంది.

---

6. కవిమణి : మలరుం మాలైయుం – భారతియుం పట్టి కాట్టానుం – 17

# అధ్యాయం - 2

## కోయిల ప్రేమకథ

కోయిల సమ్మోహన కరమైన పాట ముగిసింది. అంతటా ప్రశాంతత నెలకొంది. తోటలో పెక్కుచోట్ల గుమికూడిన పక్షులన్నీ ఎక్కడెక్కడికో వెళ్లి కనిపించకుండా పోయాయి. పాట విన్న కవిగారి హృదయంలో ఆనందమూ, దుఃఖమూ కలగలిసింది. ఈ దశలో ఒక చెట్టుకొమ్మ మీద ఆడకోయిల ఒకటి ఏకాంతంగా దుఃఖంతో వాడిపోయి ఉండడం చూశారు కవిగారు. వెంటనే అది ఉన్న చెట్టు దగ్గరికి వెళ్లి,

> ***"ఓ కోయిలా! ఐశ్వర్యమా! మహదానందం కలిగించే పాట కలిగినదానా!***
>
> ***ఏడేడు లోకాలను ఆనందాబ్ధిలో ఓలలాడించే సామర్థ్యము కలిగినదానా!***
>
> ***విచారం నీకెందుకు కలిగింది? మాట్లాడవా!"*** [1]

అని అడుగుతారు. ఆ మాయ కోయిల కూడ మానవభాషలో ఇలా మాయ మాటలు చెప్పింది.

> ***ప్రేమ కొరకై కరిగిపోతున్నాను, లేకపోతే***
>
> ***ప్రేమ కోసమై తపిస్తున్నాను*** [2]

అంటూ సమాధానం చెప్పింది. కవిగారు ఆ కోయిల ప్రేమ

---

1. కుయిల్ పాట్టు : కుయిలిన్ కాదల్ కదై, పాదం (8–10)
2. పైదే : పాదం (13–14)

పొందలేక పోయిన కారణమేమిటని మళ్లీ అడుగుతారు. వేదన, సిగ్గు కలగలిసిన గొంతుతో ఆ గానకోకిల కథ చెప్పడం ప్రారంభించింది.

"ఓ ఉన్నతకుల సంజాతుడా! వాస్తవాన్ని పూర్తిగా చెప్పబోతున్నాను. నా ఆడజన్మకు కనికరించి తప్పులను ఓర్చుకోవడం మీ బాధ్యత. ఏదో నా పూర్వజన్మ ఫలం కారణంగా ఈ భూమిలో జ్ఞానమూ, ఆకారమూ కృశించి చిన్న గువ్వగా పుట్టాను. అయినప్పటికీ దేవతల కరుణాకటాక్షాల వల్లనో, దైవ ఆగ్రహం కారణంగానో అన్ని భాషలనూ అర్థం చేసుకునే వరం పొందాను. మానవుల హృదయాల్లో ఉన్నవన్నీ తెలుసుకునే అదృష్టం నాకు లభించింది.

*గాన కోకిల గల గలమంటూ శబ్దంచేస్తూ*
*వృక్షాల మధ్య గాలి వెలువరించే సవ్వడులలోనూ*
*... ... ... ... ... ...*
*వలయాకారంగా నాట్యంచేసే స్త్రీల చేతి గాజులు*
*గల గలమంటూ శబ్దం చేయగా*
*తాళంవేస్తూ గుంపుగా పాడే అమృతగానంలోనూ*
*... ... ... ... ... ...*
*దేశంలోనూ, అరణ్యంలోనూ, రోజంతా శుభాలను ధ్వనించే*
*పాటలోనూ నా హృదయాన్ని ధారపోసుకున్నాను, పాపిష్టిని*
*నాలుక ఉచ్చరించడానికి భయపడే మాటలను*
*పాపిష్టి మనస్సు గట్టిగా పట్టుకొని నిలబడింది ఎందుకో?"*

అంటూ మళ్లీ మాటలను కొనసాగించింది.

కోయిల తన మాటలను కొనసాగించింది. "నా హృదయంలోని ఆవేదన మీకు బాగా తెలుసు. నా మనఃస్థితిని బాగా అర్థం చేసుకోనుంటారు. ఏం చేసేది?"

*"ప్రేమను అపేక్షించి కరిగిపోతున్నాను. లేకపోతే*
*ప్రేమను కోరుతూ తపిస్తున్నాను."*

అని చెప్పింది.

ఈ విధంగా కోయిల కథను వినగా వినగా కవిగారికి ఆనందోద్వేగం పెల్లుబుకుతుంది. ఆ చిన్న కోయిల మీద అభిమానం పెంచుకుంటారు. ఆయన హృదయంలోనూ, ప్రాణంలోనూ ఆ చిన్నారి కోయిల మాటలు గాఢంగా నాటుకుపోయాయి.

*"ప్రేమ, ప్రేయసి ప్రేమ దొరక్కపోతే,*
*ప్రేమ... ప్రేమ... " అనే పల్లవి*

కవిగారి హృదయవీణా తంతువులలో మెల్లగా మోగాయి. హృదయం మైమరచి దిగ్భ్రాంతితో నిలబడిపోయారు. ఈ దశలో కనబడకుండా పోయిన పక్షులన్నీ ఆ తోటలోని చెట్లకొమ్మల మీద వాలి కల కల ధ్వనులు చేయడం ప్రారంభించాయి. నల్లని కోయిల మళ్లీ మాట్లాడడం ప్రారంభించింది.

"ఓ ఉన్నతకుల సంజాతుడా! ప్రేమమార్గం కంటక సదృశమని పెద్దలు చెప్పగా విని ఉన్నాను. నేను శోక సముద్రంలో కొట్టుమిట్టాడు తున్నప్పుడు మీరు పడవలాగ నా ముందుకు వచ్చారు. నా బాధలన్నీ ఉపశమించే లాగ మీరు నాతో సంభాషిస్తున్నప్పుడు నేను పొందిన

ఆనందానికి అడ్డంకి ఏర్పడింది. ఎక్కడికో వెళ్లి దాక్కున్న పక్షులన్నీ మళ్లీ వెనుదిరిగి వచ్చేశాయే. వచ్చే నాలుగో రోజు మీరు ఇక్కడికి వచ్చి మమ్మల్ని అనుగ్రహించాలి. మీరు దీన్ని మరిచిపోకూడదు. ఓ జ్యోతి స్వరూపుడా! ఇప్పుడు నా మనసును దోచుకొని వెళ్తున్నారు. మీరు మళ్లీ వచ్చేటట్లు ఉంటేనే నా ప్రాణాలు నిలబడుతాయి. ఈ నాలుగురోజులు నాకు పదియుగాలుగా గడుస్తుంది. వెళ్లిరండి."

ఈ విధంగా ఆ చిన్నారి కోయిల తీరని శోకంతో కవిగారికి వీడ్కోలు చెప్పి పంపిస్తుంది.

ప్రేమైక జీవితంలో ప్రేమికులు కలుసుకునే ప్రదేశాన్ని 'సంకేతస్థలం' అని చెబుతారు. ఇది 'పగటి సంకేతం' 'రాత్రి సంకేతం' అని రెండు రకాలు.

*"కుఱియెన పడువదు ఇరవినుం పగలినుం*
*అఱియ క్కిళంద ఆఱ్ఱ దెన్ప"[3]*

(సంకేతస్థలం అనేది పగటి సంకేతం, రాత్రి సంకేతం అని రెండువిధాలుగా పేర్కొనబడుతుంది)

ప్రణయ కలహం ముగిసిన తరువాత తాము కలుసుకోబోయే సంకేతస్థలాన్ని నాయిక సూచించిడం ఒక రకమైన సంప్రదాయం. ప్రేమికుల సమాగమానికి ఏకాంతస్థలాన్ని నాయికయే చెప్పడం మంచిదని తొల్కాప్పియర్ భావం.

"అవన్ వరం పి రత్తల్"[4] అనే పద్యభాగంలో కూడ తొల్కాప్పియర్

3. తొల్కాప్పియం, పొరుళ్ అదిగారం, కళవియల్ – 40

4. పైదే : 30

పై భావాన్నే సూచించాడు. ఈ పద్యానికి వివరణ ఇచ్చిన ఇళంబూరనార్ కూడ "ప్రణయకలహం ముగిసిన తరువాత నాయకునికి సంకేతస్థలాన్ని సూచించడం నాయిక ధర్మమని చెప్పాడు. కోయిలపాటలో కోయిల కవిగారిని నాలుగో రోజు అదే ఉద్యానవనంలో కలుసుకోమని ప్రార్థించడంలో ఈ సంప్రదాయం చూడవచ్చు.

రహస్య ప్రణయం అంతరంగ ప్రణయమే అని చెప్పే ఒక సంప్రదాయం కూడ ఉంది. కోయిల పాటలో కోయిలకు కవికి జరిగినది అంతరంగ ప్రణయమే అనేది ఆలోచించదగింది.

ప్రణయావేశంలో మునిగి ఉన్న నాయకుని మానసికస్థితిని ప్రణయకావ్యాలు సువిస్తరంగా వర్ణించాయి. ఈ పరిస్థితినే తిరుక్కురళ్ "తగైయనం గుఱుత్తల్" [5] (సౌందర్యాధన) అనే విభాగంలో స్పష్టంగా వివరించారు. దీనిని పరిమేలళగర్ చక్కగా వ్యాఖ్యానం చేశాడు.

> ***"... తాక్కు అణంగు***
> ***తానై కొండన్నదు ఉదైత్తు"*** [6]

ఆమె చూపులనే బాణాలకు మారుగా నేను ఆమెను చూశాను. ఆమె తిరిగి నన్ను చూసింది. అది ఎలా ఉందంటే ఒక సైన్యమే దండెత్తి వచ్చినట్లు తోచింది. ఈ పరిస్థితిని తొల్కాప్పియరు కూడ "ఒరుతలై యుళ్లుదల్ ఇదైలిడాదు నినైత్తల్; మరత్తల్-పిత్తాదల్" [7] అని వివరించారు. కోయిల పాట ఈ పరిస్థితిని కోయిల దగ్గర కవి దగ్గర చిత్రించి చూపుతోంది.

---

5. తిరుక్కురళ్, అధిగారం 109
6. తిరుక్కురళ్ - 1082
7. తొల్కాప్పియం, పొరుళ్ - కళవియల్ - 9

కోయిల మధుర గీతాన్ని విన్న కవిగారికి తాము చూసిన దృశ్యం కలా? నిజమా? అని అర్థం చేసుకోవడానికి వీలుకాలేదు. ఆలోచించే సామర్థ్యాన్ని కోల్పోయారు. ఇరవై పిశాచాలు ఒక్కుమ్మడిగా పైబడినట్లు కళ్లల్లో, ముఖంలో ఆనంద పారవశ్యం తాండవించింది. కామదేవుని వాడిబాణాలు హృదయంలో చొచ్చుకుపోయాయి. ప్రేమ మైకం కారణంగా చూసిన దృశ్యమంతా కొమ్మలు, కోయిలలాగ 'కోటి పెక్కుకోట్లుగా' కనిపిస్తున్నాయి.

*'నోక్కువ ఎల్లాం అవైయే పోఅల్'* [8]

(ఎటు చూసిన అతనికి ప్రేమ మయంగానే కనిపిస్తోంది) అని ప్రేమ మైకంలో ఉన్నవారిని గురించి చెబుతుంటారు. ఆ స్థితి కవిగారికి ఏర్పడింది. ఇది ఒక విధమైన భ్రాంతి(Hallucination) అవుతుంది. రావణుడు సీతను ఎడతెగకుండా స్మరించడం వల్ల ఆమె రూపం అంతటా భ్రాంతిగా కనిపించడం, అదేవిధంగా శూర్పణఖ రాముని సదా తలచుకోవడం వల్ల అతని రూపం అంతటా కనిపించినట్లు రామాయణంలో చెప్పబడింది.[9] కోయిల ఏర్పరిచిన ప్రేమ మైకంచే కవిగారి హృదయం నిలకడగా ఉండలేకపోయింది.

ఇంట్లో ఒకరోజు గడపడం ఒక యుగంగా తోచింది.

*"ఒకరోజు గడపడానికి నేను పడిన పాట్లన్నీ"* [10]

అని కవిగారే తన పరిస్థితిని చెప్పుకుంటున్నారు. ఎలాగో ఒకరోజు

---

8. పైదే. 9

9. కంబ రామాయణం. ఆరణ్య, మారీచ వధ - 148-149

10. కుయిల్ పాట్టు - కాదలో కాదల్. పాదం (8-9)

గడిచిపోయింది. మరురోజు కోయిలను చూడ్డానికి దారంతో కదలాడే బొమ్మలాగ రెండుకాళ్లతో ఆ ఉద్యానవనానికి నడిచి వచ్చారు. ఎల్లలు దాటిన సిగ్గుతో కోయిలను వెతుకుతారు కవి. ఎదురుచూడని దృశ్యాన్ని చూస్తారు కవిగారు.

ఆ చిన్న కోయిల ఒక మగకోతితో ప్రేమనాటకం ఆడుతుండడం చూస్తారు. కవికి కోపం తలకెక్కింది. తన చురకత్తితో కోయిలను, కోతిని చంపాలని అనుకుంటారు. కాని అతని మనసు కోయిల చెప్పే మాటలు వినాలని ఆశపడింది. కోతిమాటలకు బదులుగా కోయిల పలికిన పలుకులను ఏదో ఒక శక్తిచే అర్థం చేసుకుంటారు కవి. నీచమైన ఆ చిన్న కోయిల నిప్పులాంటి గొంతుతో "ప్రేమ, ప్రేమ ..." అని కోరికలు రేకెత్తుతుండగా అమృతం జాలువారగా పాడింది. తరువాత కోతి మాట్లాడింది కూడ విన్నారు. ఆ మాటలు కవి కోపాన్ని ద్విగుణీకృతం చేసింది. వెంటనే దానిపై కరవాలాన్ని విసురుతారు. అది తప్పించుకొని ముఖం చిట్లిస్తూ కుప్పించి కొమ్మల్లో దాక్కుంటుంది. "సాటిలేని మాయకోయిల కూడ" మాయమైంది. ఇప్పుడు తోటలో ఉన్న పక్షులన్నీ గుంపులు గుంపులుగా కిల కిలారావాలు చేయడం ప్రారంభించాయి. దాని తరువాత ఏం చేయాలో తెలియక పడుతూ లేస్తూ తోటలో కోయిలను వెతికారు. ఆ "చిన్న రాక్షసి కోయిల" ఎక్కడా కనిపించలేదు. ఇంతలో పొద్దెక్కిపోయి పగటివేళ వచ్చేసింది.

> ***"ఆకాశం నట్టనడుమ కళంకం లేని సూర్యుడు***
> ***నిశ్శబ్దంగా కొలువై ఉన్నాడు"[11]***

అలసిన శరీరంతో, మనసు చెల్లాచెదరు కాగా కళ్లల్లో మైకం

11. కుయిల్ పాట్టు – ఇరుళుం ఒళియుం. పాదం (1–2)

కమ్ముతున్న స్థితిలో ఏం చేయాలో తెలియక గుండె టక టకమని కొట్టుకుంటూ ఉండగా ఇల్లువచ్చి చేరుకున్నారు కవి. స్పృహతప్పి పడకమీద వాలిపోతారు.

మూడోరోజు ఉదయం, తెల్లవారి లేచిన వెంటనే "కాళ్లు రెండూ మునుపటిలాగ తోటలోనికి లాక్కెళ్లగా తనకు తెలియకనే తోటలోపలికి వచ్చి నిలబడి చుట్టుపక్కల కోయిలను వెతికారు. అప్పుడు తోటలో ఉన్న పక్షుల గుంపు ఏదీ కనిపించలేదు. తోటలో ఒక మూలగా ఉన్న మామిడిచెట్టు కొమ్మల్లో ఉన్న కోయిల తన సుదీర్ఘమైన కథను చెబుతుండడం, కింద ఉన్న ముసలి ఎద్దు ఒకటి దాన్ని ఆనందంగా, ఆసక్తిగా వింటుండడం చూశారు. ఆశ్చర్యపోయారు. చంచలించి పోయారు. హృదయంలో నిప్పులు చెలరేగాయి. కుములుతున్నారు. రగులుతున్నారు. శరీరమంతటా చెమటలు పట్టాయి. ఆ కోయిలమీద కత్తి విసరాలని అనుకున్నారు. అయితే ఈ మాయపక్షి చెబుతున్న మాటలు విన్న తరువాత "చంపడమే పన్నాగం" అని మనసు భావించింది. పూర్వంలాగ స్థిరంగా నిలబడి అడుగుతున్నారు. కోయిల కూడ "మోహంతో కూడిన పాతకథను బంగారు గొంతుతో, చక్కని పదబంధాలతో" తన కథను చెప్పి పాతదైన తన కల్పనా గతాన్ని ఎనిమిది దిక్కుల్లో ఆనందంగా పరవశించే విధంగా" "ప్రేమ ఓ ప్రేమా" అంటూ ఆలపించింది. కవి ఆ మధుర సంగీతంలో గాఢంగా లీనమై తనను తానే మరచిపోయారు. తరువాత తెలివి తెచ్చుకొని చేతికి కత్తి తీసుకొని ఎద్దుమీద విసురుతారు. కత్తి తన శరీరం మీద పడడానికి ముందుగానే ఎద్దు పరిగెత్తి మాయమైంది. అందమైన కోయిల కూడా మాయమైపోయింది. పక్షులన్నీ మళ్లీ తోటలోనికి వచ్చి చేరుకున్నాయి. కిలకిలా రావాలు ప్రారంభమయ్యాయి.

*సిగ్గు లేకుండా ప్రేమించిన నేను చిన్నారి కోయిలను*
*అన్వేషిస్తూ ఇంటికి వచ్చి చేరుకున్నాను* [12]

అంటూ జరిగిన దానికి చాలాసార్లు తలుచుకొని కలత చెందారు.

*తలచుకొని తలచుకొని చూశాను. ఏదీ అర్థం కాలేదు;*
*కళ్లల్లో నీళ్లు చిందుతుండగా గానకోయిల నాకు*
*ప్రేమగాథను వినిపించి హృదయాన్ని కరిగించింది.*
*అమాయకుడనైన నేను వ్యామోహాన్ని పెంచుకున్నాను*
*ఈ మధురమైన కథ నడుమ అడ్డుగా*
*పక్షులన్నీ ప్రవేశించిన అద్భుతాన్ని*
*ఏదీ తెలియని నా హృదయంలో కామాగ్నిని*
*ప్రేరేపించి నా హృదయాన్ని విస్మయ పరిచింది*
*కుంటికోతి, ఎద్దు వచ్చి నాకు*
*శత్రువులుగా మారిన క్రూరత్వాన్ని*
*ఇన్నిటికీ నేను సిగ్గు లేకుండా*
*పిచ్చివాడనైన వైపరీత్యానికి*
*తలచి తలచి చూశాను, ఏదీ అర్థం కాలేదు*
*కళ్లు రెండూ మూసుకోగా*
*గాఢమైన నిద్రలో మునిగిపోయాను.* [13]

నాలుగోరోజు వచ్చింది. ఈ రోజే లేని ప్రేమ చూపించి మైమరిపించి కుట్ర చేసిన మాయా కోయిల నాతో చెప్పిన రోజు అవుతుంది.

---

12. కుయిల్ పాట్టు : 7 కుయిలుం మూడుం. పాదం (107-108)

13. పై. దే. పాదం (109-122)

కోయిల చేసిన అవమానాలన్నింటినీ తలచుకొని అక్కడ కూర్చున్నారు. మనసు తోటదారినే కోరుకుంటోంది. ఆకాశంలో ఆ క్రూరమైన పక్షి వచ్చి దారి చూపించి వెళ్లగా కవి అదే మామిడి తోటకు వస్తారు.

*కాంతి కిరణాలు పడుతున్న ఒక కొమ్మమీద*
*చిన్నారి నల్ల కోయిల అందంగా కూర్చొని*
*బంగారు వేణువులో కొత్తరాగంతో*
*పాత పాటలను తాను పాడుతూ ఉండడం*
*చూశాను, చింతించాను, ఎదురుగా వెళ్లి*
*"ఓ నీచమైన కోయిలా! ఓ అసత్యమా!"*
*అటు కోతిని ఇటు ఎద్దును*
*తలుచుకుంటూ పాడే హీనమైన పాటను*
*వినిపించడానికి వచ్చావు కాబోలు!* [14]

అని ఉప్పొంగిన కోపావేశాలతో మాట్లాడడానికి ప్రయత్నించాను. తరువాత హృదయం కరిగి ఆ పని మానివేస్తారు. అప్పుడు ఆ చిన్నారి కోయిల తాను కోతితో, ఎద్దుతో 'ప్రేమ నాటకం' ఆడింది తన తప్పు కాదని, అది విధి చేష్టితమని చెప్పి పొదియ పర్వతంలో ఉన్న మునివరేణ్యులు తనకు చెప్పిన పూర్వజన్మ చరిత్ర చెప్పడం ప్రారంభించింది.

14. పైదే – నాన్గామ్‌నాళ్ . పాదం (28–36)

# అధ్యాయం - 3

# కోయిల పూర్వజన్మ చరిత్ర

కోయిల తానే కవికి తన చరిత్ర చెప్పడం ప్రారంభించింది.

"పూర్వం ఒకరోజు పొదిగై పర్వతం జలపాతం చేరువలో ఉన్న ఒక తోటలో ఏకాంతంగా ఏదో ఆలోచిస్తూ ఒక చెట్టు కొమ్మపై కూర్చోనున్నాను. అప్పుడు ఒక ముని అక్కడికి వచ్చాడు. ఆయన పాదాలపై వాలి నమస్కరించాను. వారు కూడ నన్ను ఆశీర్వదించారు. వారిని చూసి "వేదాలను ఆపోశన పట్టిన ఓ మునివరేణ్యుడా! నేను నిన్ను జాతికి చెందిన పక్షిగా జన్మించాను. అయినప్పటికీ తోటి కోయిలల స్వభావంలాగ కాక నా స్వభావం భిన్నంగా ఉంది. అందరూ మాట్లాడుకునే భాషలన్నీ నాకు అర్థమవుతాయి. మనుషులకున్న తెలివితేటలు కూడ నాకున్నాయి. దీనికి కారణం ఏమి? దయచేసి నా మనసులో మెదిలే ఈ అనుమానాలను తీర్చండి" అని ప్రార్థించాను.

మునివరేణ్యులు ఇలా చెప్పారు : ఓ కోయిలా! విను. చేరదేశంలో దక్షిణ దిగ్భాగంలోని ఒక కొండలో వీర మురుగన్ అనే ఒక వేటగాడు ఉండేవాడు. అతడు వేటగాళ్లకు నాయకుడు. అతనికి ప్రియమైన కూతురిగా పెరిగి పెద్దదాన వయ్యావు. 'చిన్ని కోయిల' అనేది నీ పేరు. చేర , చోళ, పాండ్య– ఈ మూడు దేశాల్లో నిన్ను పోలిన అందగత్తె వేరొకరు లేరని అందరిచేతా ప్రశంస లందుకునే విధంగా నీవు విరాజిల్లావు. మాడన్ అనే పేరు కలిగిన నీ మామకొడుకు నీ అందాలను చూసి మన్మథుని బాణాలకు ఎర అయ్యాడు. నిన్న పెళ్లి చేసుకోవాలని చాలాకాలం నిరీక్షించాడు. నీ చుట్టూ తిరుగుతుండేవాడు.

*"పొన్న పుష్పాలలోని మధువును తీసుకువచ్చి*
*రోజూ నీకు సమర్పించి నీ ఆలోచనలతోనే"* [1]

మనోవ్యాకులుడై ఉండేవాడు. నీకు మాత్రం అతనిమీద ప్రేమ కలగలేదు. అతడు పడుతున్న దుఃఖాన్ని చూసి సహించలేక అతనిమీది జాలితో పెళ్లి చేసుకుంటానని వాగ్ధానం చేశావు.

నీ అందచందాలకు సంబంధించిన కీర్తి దేశమంతా వ్యాపించి ఉండేది. తేనె పర్వతం మీద మొట్టై పులియన్ అనే పేరుగల ఒక వేటగాడు ఉండేవాడు. అతడు వేటగాళ్లకు రాజు. అతడు సిరిసంపదల్లోనూ, బల పరాక్రమాల్లోనూ ప్రసిద్ధుడు. దేశమంతా అతని వీరోచితమైన సాహసకృత్యాలు చూసి భయపడేది. అతని కొడుకు నెట్టై కురంగన్‌కు నిన్ను ఇచ్చి పెళ్లి చేయాలని నీ తల్లిదండ్రులు నిశ్చయించారు.

నాలుగైదు రోజుల్లో వైభవంగా పెళ్లి జరిపించాలని అనుకున్నారు. ఈ వార్త మీమామ కొడుకు మాడన్‌కు తెలిసింది. అతడు భగ్న హృదయుడై నీ దగ్గరికి వచ్చి ఎన్నో విధాలుగా చెప్పాడు. నీవు కూడ అతనిమీది కరుణతో "మాడా! నీ క్రోధావేశాలను ఉపశమించుకో. ఏదో నిర్బంధం కారణంగా కురంగన్‌కి భార్య అయినప్పటికీ, బలవంతంగా నన్ను బంగారు పంజరంలో బంధించినప్పటికీ మూడే మూడు దినాల్లో ఏదో మాయోపాయం చేసి నేను ఇక్కడికి వచ్చేస్తాను. తాళిబొట్టును అతని చేతిలో పెట్టి నిన్నే భర్తగా పొందుతాను. నీకిచ్చిన వాగ్ధానాన్ని ఎన్నటికీ తప్పను. నన్ను నమ్ము" అని అతనితో చెప్పింది.

"కొన్ని రోజులు గడిచిన తరువాత, నీవు, నీ చెలికత్తెలతో ఒకరోజు

1. కుయిల్ పాట్టు ; కోయిల పూర్వజన్మ చరిత్ర. పాద. (25-27)

సాయంత్రం అరణ్యంలో విహరిస్తూ ఉన్నావు. చేరదేశపు రాజకుమారుడు వేట నిమిత్తం మీరు విహరిస్తున్న అరణ్యం వైపుగా వచ్చాడు. తోడుగా వచ్చిన సైనికులను వదిలి ఒక జింకను తరుముకుంటూ నీవున్న చోటికి వచ్చాడు. నీవు, నీ చెలికత్తెలతో ఆడుకుంటున్నది చూశాడు. అతడు నిన్ను తన దానిగా  చేసుకోవాలని నిశ్చయించాడు. నీవు కూడ అతనిని చూసి మోహ పరవశురాలవయ్యావు.

> *"నిన్ను అతడు చూశాడు; నీవు అతన్ని చూసి నిలబడ్డావు.*
> *మీ ప్రథమ వీక్షణంలోనే హృదయాలు సంగమించాయి."* [2]

నీ చెలికత్తెలు కూడ అతడు దేశాన్ని పరిపాలించే రాజుగారి ప్రియమైన కుమారుడని భావించి భయంతో దూరంగా వెళ్లిపోయారు. రాజకుమారుడు తన్ను తాను పరిచయం చేసుకొని తన ప్రేమను నీముందు అభివ్యక్తీకరించాడు. నీవు కూడ నీలో పొంగులెత్తుతున్న ప్రేమావేశాలను అణచుకొని,

> ***"రాజకుమారా! నీ అంతఃపురంలో అయిదువందలమంది***
> ***అందగత్తెలు ఉండి ఉంటారు; అందంలో***
> ***తమకు సాటి అయినవారు లేరుట,***
> ***విద్యావంతులట, శిలలను కూడ కరిగించగల***
> ***అద్భుత గాయనీమణులట***
> ***అటువంటి యువతులతో కలసి ప్రేమగా***
> ***జీవనం సాగిస్తూ ఉంటావు! రాజా ప్రార్థిస్తున్నాను!***

---

2. పైదే. పాదం. (71-72)

*కొండ కురవజాతికి చెందిన అమ్మాయిని నేను,*
*మృగాలను సంహరించే సింహం కుందేలును ప్రార్థిస్తుందా?*
*రాజ్యాలను జయించే మహారాజు*
*వేటగాళ్ల కులంలోని అమ్మాయిని స్వీకరిస్తాడా?*
*... వెలయాలిగా మేము కాపురానికి వెళ్లము.*
*మీ బంగారు పాదాలకు నమస్కారం.*
*వెళ్లిరండి. చెలికత్తెలు కూడ*
*నన్ను వదలివెళ్లారు. నేను ఏం చేసేది?"*[3]

అంటూ హృదయం సంచలిస్తుండగా నిలుచున్నావు. నీలోని ప్రేమను నీ చూపుల ద్వారా తెలుసుకొని దగ్గరికి వచ్చి నీ బుగ్గలు ఎర్రబడగా నిన్ను ముద్దు పెట్టుకున్నాడు. వేదశాస్త్ర పద్ధతి ప్రకారం నిన్ను పెళ్లి చేసుకుంటానని మాట ఇచ్చాడు.

"మీరు గాంధర్వపద్ధతిలో కలుసుకున్నారు. రాజు ప్రేమతో నిన్ను కౌగలించుకొని దొండపండు వంటి నీ పెదవులను ముద్దాడుతుండగా ఎదురుచూడని సంఘటన ఒకటి జరిగింది. అంతకు ముందు పక్కనున్న గ్రామానికి వెళ్లి తిరిగి వచ్చిన నెట్టైకురంగన్ నీవు చెలికత్తెలతో అరణ్య ప్రాంతాలకు వెళ్లినది తెలుసుకొని నిన్ను చూడాలని వచ్చాడు. నీవు చేర రాజకుమారుడి కౌగిలిలో మైమరచి ఉండడం కళ్లారా చూశాడు. హృదయంలో పెల్లుబుకిన కోపావేశంతో అక్కడే నిలబడ్డాడు. 'నెట్టై కురంగన్' ఊరికి వచ్చిన వార్త, అతడు నువ్వు చెలికత్తెలతో అరణ్యానికి వెళ్లిన వార్తను ఎవరో 'మాడన్' దగ్గర నిప్పంటించారు. ఈర్ష్యాసూయలతో కళ్లల్లో నిప్పులు

3. పైదే. పాదం. (81-91)

చిమ్ముతూ అక్కడికి వచ్చి చేరుకున్నాడు మాడన్. వీడు రావడం కురంగన్ చూడలేదు. నెట్టైకురంగన్ పొడవాటి వృక్షంలాగ నిలబడి ఉండడం మాడన్ కూడ చూడలేదు. మీరిరువురు

*"ప్రణయాంబుధిలో మునిగి కళ్లు తెరవలేదు,*
*హృదయాల సంగమంలో అమృతసుఖంలో*
*పరవశంలో మునిగి ఉన్న చూపులు నాలుగు*
*ఈ దృశ్యాన్ని చూడడం వల్ల హృదయంలో నిప్పులు చెలరేగగా*
*నాలుగు కళ్లల్లో నిప్పురవ్వలు చెలరేగుతుండగా*
*మాడన్ తన కరవాలం తీసి రాజును చంపడానికి*
*పరిగెత్తుకుంటూ వచ్చాడు; నెట్టైకురంగన్ కూడ*
*ఖడ్గం ఝుళిపిస్తూ వచ్చాడు."* [4]

ఒకే సమయంలో రెండు ఖడ్గాలు రాజకుమారునిపై పడ్డాయి. రాజకుమారుడు కూడ తటాలుమని వెనుదిరిగి ఖడ్గం తీసి ఒకేదెబ్బతో ఆ ఇరువురినీ నేల కూల్చాడు. మాడన్, కురంగన్ ఇరువురూ వెంటనే విగత జీవులయ్యారు. రాజకుమారుడు కూడ స్పృహతప్పి నేలమీద వాలిపోయాడు.

"నీవు భరించలేని శోకంతో రాజకుమారుని తన ఒడిలో పరుండబెట్టుకొని, కళ్లల్లో బాష్పజలాలు కురుస్తుండగా దుఃఖిస్తూ ఉన్నావు. అప్పుడు రాజకుమారుడు కళ్లు తెరిచి

*"మానినీ! ఇక నేను ప్రాణాలతో ఉండలేను;*
*కొద్ది క్షణాల్లో నా ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి*

4. పైదే. పాదం. (145–151)

*ఏడవడం వల్ల ప్రయోజనం లేదు*
*ఓ యువతీ! ఇక మీదట కూడ మనం*
*ఈ భూమిలో జన్మించుదాం*
*నిన్నుచూసి మోహపరవశున్నవుతాను*
*నీతో కలసి జీవనం సాగిస్తాను*
*ఇంకో జన్మ ఉంది, ఆనందమూ ఉంది*
*నీతో కలసి కాపురం చేసే అవకాశం*
*మరో జన్మలో కలుగుతుంది!"* [5]

అని చెప్పి కళ్లు మూసుకొని సంతోషంగా మందహాసం చేశాడు. నీ ముఖం చూస్తూనే కళ్లు మూశాడు. మాడన్ చేసిన మాయ కారణంగా ఇప్పుడు ఈ పాపిష్ఠి పక్షి ఆకారం నీకు ఏర్పడింది. నీ ప్రియుడు తొండై రాజ్యంలో సముద్రతీరంలోని ఒక నగరంలో మానవుడుగా పుట్టి పెరుగుతున్నాడు. నిన్ను ఉద్యానవనంలో చూడగలడు. నువ్వు మధురాతి మధురంగా పాడే పాటను వింటాడు. పూర్వకర్మ ఫలితంగా నిన్ను మోహిస్తాడు." – ఈ విధంగా ఆ పొదిగై పర్వతానికి చెందిన మునివరేణ్యుడు చెప్పాడు.

నేను ఇలా అడిగాను: "నేను ప్రస్తుతం కోయిల రూపంలో ఉన్నాను. రాజకుమారుడు మానవరూపంలో ఉన్నాడు. మా మధ్య ప్రేమ నెలకొన్నప్పటికీ ప్రేమ ఎలా సాధ్యమవుతుంది? మరణసమయంలో రాజకుమారుడు చెప్పిన మాటలు అబద్ధమవుతాయా?" అని

---

5. పైదే. పాదం. (161–167)

చిరునవ్వులు చిందిస్తూ మునివరేణ్యుడు ఇలా చెప్పాడు: "ఓ అమాయకురాలా! ఈ జన్మలో కూడ నీవు వింధ్య పర్వతం ప్రాంతాల్లో ఉన్న ఒక వేటగాడికి కూతురుగా జన్మించావు. విధి కారణంగా మాడన్, కురంగన్ ఇరువురూ అడవి పిశాచాలుగా అడవులు కొండలు చుట్టి వస్తూ ఉండగా నిన్ను చూశారు. ఈ జన్మలో కూడ నీవు రాజకుమారునే పెళ్లి చేసుకుంటావని అనుకొని నిన్ను కోయిలగా మార్చివేసి నీవు వెళ్లే ప్రదేశాలకంతా నీతోపాటే వస్తున్నారు. నీకిది అర్థం కాలేదా?" అన్నాడు.

నేను మళ్లీ అడిగాను. "అయ్యా! అది విధి అయినప్పటికీ మరణించినవారు జీవించి ఉన్నవారిని బాధపెట్టడం న్యాయమా? దయ్యాలు నన్ను భయపెట్టి, నా జన్మను మరిచిపోయేలా చేసి బాధలకు గురిచేసినట్లయితే, నేను నా ప్రియుని చూసినప్పుడు నాకు ఏదైనా అపకారం చేసినట్లయితే నేను ఏం చేసేది? దీనికి పరిష్కారం ఏమీ లేదా?" అని అడిగాను.

ముని వరేణ్యుడు ఇలా చెప్పాడు: ఓ ఆడకోయిలా! తొండై మండలంలోని ఒక ఉద్యానవనంలో రాజకుమారుడు నిన్నుచూసి, నీ పాటకు మైమరిచి నీమీది ప్రేమగొన్నప్పుడు రెండు పిశాచాలు పెక్కు మాయా కృత్యాలు చేసి పలురకాలైన ఆకారాలు ధరించి మళ్లీ రాజకుమారుని భయపడేలాగ చేస్తాయి. రాజకుమారుడు కూడ నీవు వంచకి అని అనుకొని చిత్తభ్రాంతి చెంది నీమీది కోపంతో నిన్ను పరిత్యజించాలని అనుకుంటాడు. ఆ తరువాత జరిగేవన్నీ నీవే తెలుసుకుంటావు. సంధ్యాజపం చేసే సమయం ఆసన్నమైంది" అని చెప్పి అతడు అంతర్ధానమయ్యాడు.

తరువాత కోయిల కవిగారిని చూసి ఇలా మాట్లాడింది: "ఓ

ప్రేమికుడా! మునివరేణ్యులు చెప్పినవన్నీ అలాగే చెప్పేశాను. అయ్యా! వీటిని మీరు ఏవిధంగా స్వీకరిస్తారో నాకు తెలియదు. పండితుడా! నామీద ప్రేమను కురిపించు. లేకపోతే నీ చేతులతోనే నన్ను చంపి నాకు మరణం ప్రసాదించు." అని చెబుతూ కవి చేతుల మీద పడింది. ఆ కవిగారు ప్రేమోద్రేకంతో ఆ కోయిలను ముద్దు పెట్టుకుంటారు. ముద్దుపెట్టిన అదే క్షణంలో ఆ కోయిల కనిపించలేదు.

*వివరించలేని అద్భుతమురా! ఇది ఆశ్చర్యమురా!*
*ఆశా సముద్రపు అమృతమురా!*
*అద్భుతమైన దేశమురా!*
*స్త్రీత్వమే దైవత్వమొందిన దృశ్యమురా!*
*యువతి ఒకతె అక్కడ నిలబడిందిరా!*
*ప్రేమతో కళ్లు అప్పగించి నన్ను ఒక్కక్షణం చూసింది;*
*కొంత తలవాల్చింది; ఓస్వామీ!*
*దీనిని నేను ఏవిధంగా తమిళంలో పాడగలను*
*కళ్లు రెండూ మనిషిని కబళించే అద్భుతాన్ని చెప్పేదా?*
*మరుచూపులో తేలిన కవిత అంతా*
*మాటలకు అందుతుందా? స్వచ్ఛమైన కాంతులీనే*
*ముత్యాలను పోలిన దంతాలలో*
*నిండు పెదవులపై ప్రసరించిన వెన్నెలను నేను*
*ఎప్పటికైనా మరిచిపోవడానికి సాధ్యమా?*
*ప్రపంచంలో నిలుచున్న ఒక మెరుపు కేతనం లాగ*

*విరాజిల్లే స్త్రీ రత్నము యొక్క*
*దేహారోగ్యాన్ని, సౌందర్య రాశిని*
*మధువుతో సమానమైన దానిని*
*ఇతరులకు చెప్పడానికి సాధ్యమవుతుందా?* [6]

ఈ అందమైన స్త్రీ రూపాన్ని చూసి అపరిమితానందంతో ఆలింగనం చేసుకొని ముద్దు పెట్టుకొని, ముద్దు పెట్టుకొని మోహ పరవశంలో మైకంలో కొంతసేపు అలాగే ఉండిపోయాడు. కవిగారి కల చెదిరిపోయింది. కళ్లు తెరిచి చూసినపుడు చుట్టూ ఉన్న పాత పుస్తకం, పేనా, పత్రికలు, పాతచాప వరుసగా కనిపించగా "మనం ఇంట్లో ఉన్నాము" అనే స్పృహకు వచ్చారు.

*తోట, కోయిల, ప్రేమ, చెప్పిన కథ అంతా*
*సంధ్యాకాలపు అందాల మైకం కారణంగా*
*హృదయంలో పుట్టిన ఒక కల్పనయే కదా!* [7]

అని తెలుసుకున్నాడు.

6. పైదే. పాదం. (226-241)
7. పైదే. పాదం. (257-59)

# అధ్యాయం - 4

## ప్రేమ, ప్రేమ

కోయిల పాట ఒక అద్భుతమైన ప్రేమకావ్యం. దీనికి ఎవరూ అడ్డు చెప్పడానికి లేదు. "ఈ కాలంలో రాయబడే ప్రేమగీతాలు అగం శాఖ సంప్రదాయాలను అనుసరించక ఆధునిక సంప్రదాయాలతో కూడుకొని ఉండడం అత్యవసరం"[1] అని చెప్పినవారు 'కోయిల పాట' ఈ విధంగా రూపొందిన ఒక ప్రేమకావ్యం అని భావిస్తున్నారు. దీనిని స్పష్టంగా పేర్కొనక పోయినప్పటికీ భారతి గురించిన వీరి మూల్య నిర్ధారణలో ఈ భావం చోటు చేసుకోనుండడం చూడవచ్చు. ఆధునిక కాలంలో వెలువడుతున్న ప్రేమకు సంబంధించిన సాహిత్యంలో నవలలు మొదలుకొని ప్రేమకు సంబంధించిన తిణై, తుఱై మొదలైన వాటిల్లో పేర్లు లేకపోయినప్పటికీ, మౌలికంగా ప్రాచీన సంప్రదాయరీతులు జీవనాడిలాగ రూపొంది ఉండడాన్ని చూసి ఆనందించవచ్చు. ప్రణయానికి సంబంధించిన ప్రాచీనరీతులను గాఢంగా అధ్యయనం చేసినవారు ఈ కాలంలోని ప్రేమగీతాలను నిశితంగా పరిశీలించినపుడు ఆ రీతులు "ఆకుచాటు పిందెలు" లాగ రూపొంది ఉండడం చూసి అనుభవించవచ్చు.

భారతిగారి రచనలలో మిక్కిలి ప్రసిద్ధి చెందిన 'కోయిల పాట'లో కోయిల రెండుమూడుచోట్ల

> ***"ప్రేమను అర్థిస్తూ కరిగిపోతాను, లేకపోతే***
> ***ప్రేమను అర్థిస్తూ తపించిపోతాను."[2]***

---

1. సుబ్రమణ్య అయ్యర్, ఏ.వి.; తఱ్కాల తమిళ్ ఇలక్కియం (1942)
2. కుయిల్ పాట్టు : కుయిలిన్ కాదల్ కదై. పాదం (13-14), (49-50)

అంటూ ఆర్తితో కోరుకోవడం చూస్తున్నాము. "ప్రేమ విఫలమైతే మరణమే" అనే సిద్ధాంతాన్ని ఢంకా భజాయించి చెప్పే కోయిలపాట ప్రపంచ ప్రసిద్ధిచెందిన సాహిత్యగ్రంథాలలో ఒకటిగా భావించి ప్రశంసించదగిన ఒక అద్భుతమైన సృష్టి. ఈ పాటలో కావ్యకళారీతుల సామర్థ్యంతో పాటు కల్పనా చాతుర్యం ఇతర కవులలో అరుదుగానే చూడగలం.

ఈ ప్రేమ సిద్ధాంతం గురించి భారతియార్ తమ కవితల్లో చాలా సందర్భాల్లో ప్రశంసించి ఉన్నాడు. "కణ్ణన్ పాట్టు"లో "కణ్ణన్ - నా ప్రేమికుడు", "కణ్ణన్ నా సమ్మోహకుడు" - "కణ్ణమ్మ - నా ప్రేయసి" - అనే శీర్షికల్లో కనిపించే పన్నెండు కవితలు కూడ ప్రేమ గురించి భారతియార్ రచించిన అద్భుతమైన రచనలు. వీటిని సవిస్తారంగా ఇక్కడ చర్చించడానికి అవకాశం లేదు.[3] అయినప్పటికీ

***తలచి నప్పుడంతా - అతను***
***స్పర్శించిన భాగాలలో***
***చల్లగా ఉంది ఓ చెలీ! నూతనమైన***
***శాంతి ఉదయించింది చెలీ!***[4]

అనీ-

***"చెప్పి తెలుసుకొనేది కాదు మన్మథకళ -***
***వదనకాంతులను దాచుకొన్న ప్రేయసి ఇక్కడ ఉందా?"***[5]

అనీ,

---

3. కావలసినవారు కణ్ణన్‌పాట్టు త్తిఱన్ (సర్వోదయ ఇలక్కియ పణ్ణై, మదురై-625001) అనే పుస్తకం చూసి తెలుసుకోవచ్చు.
4. కణ్ణన్-ఎన్ కాదలన్ (1)-7
5. కణ్ణమ్మ-ఎన్ కాదలి (3)-1

*ఎవరు నన్ను ఇక్కడ అడ్డగించగలరు -*
*బలవంతంగా ముఖంపై నున్న తెరను*
*తొలగించినట్లయితే?*
*మాయమాటల్లో కార్యం జరగదు -*
*పండును చూసినవాడు తోలు తీయడానికి*
*కాచుకోనుంటాడా?* [6]

అనే కణ్ణన్ మాటల్లో వెలువడే కవితాభాగాల్లో ప్రేమవేశాల అనుభూతులను ఆవిష్కరించాడు కవి.

మరొక చోట

*"కవితలో ప్రేమను నేను గానం చేయగోరి*
*పరమశివుని పాద కమలాలకు నమస్కరిస్తున్నాను"* [7]

అని ప్రారంభించి ప్రేయసి ప్రశస్తిని గానం చేస్తున్నాడు.

*ప్రేయసివల్ల మానవులకు సంభోగ సుఖముంటుంది;*
*సంభోగంలో మానవుల దుఃఖాలు తొలగిపోతాయి.*
*ప్రేయసివల్ల మానవులకు కవిత లభిస్తుంది.*
*సంగీతం, దానితోపాటు శిల్పాదికళలు లభిస్తాయి.*
*అందువల్ల ప్రేమించండి ఓ ప్రజలారా!*
*అదొక్కటే కదా ఈ ప్రపంచంలోని ప్రధాన ఆనందం*
*ప్రేమవల్ల చావకుండా ఉంటాము*

6. కణ్ణమ్మ–ఎన్ కాదలి (3)–2
7. సుయచరితై : 2, బారతి అరుబత్తారు – 48

*దిగులు పోతుంది; అందువల్ల మరణం కూడ*
*అబద్ధమవుతుంది.*
*ఆదిశక్తిని తన శరీరంలో అర్థభాగం*
*చేసుకున్నాడు హరుడు*
*సరస్వతిని బ్రహ్మ తన నాలుకలో నిలుపుకున్నాడు*
*అక్షీణమైన సంపదలను అనుగ్రహించే శ్రీమహాలక్ష్మికి*
*మాధవుడు తన వక్షస్థలంలో చోటిచ్చాడు*
*దేవతలైనప్పటికీ వనితల సాహచర్యం లేకపోతే*
*సుఖాలు ఎక్కడివి?*
*ప్రేమ వర్షాన్ని కురిపించే సతీలలాను*
*శక్తిని చూశారా!*
*దైవత్వం ఆమెవల్లనే పొందగలగాలి.*[8]

పొట్టి స్వాములవారు భారతిగారికి "కాటుక అందిన కలికి ప్రేమ ఒక్కటే ఈ ప్రపంచంలో జీవించడానికి మార్గం" అని సూచించడం కూడ ఇక్కడ చూడవచ్చు.[9]

*"ఇక్కడి సంగీత గ్రంథాలన్నీ*
*సాహిత్య రచనలన్నీ*
*ప్రేమను ప్రస్తుతించేవే కదా!"*[10]

అని కావ్యాలు, ఇంకా పలురకాలైన సాహిత్య రచనలన్నీ ప్రేమకు

---

8. పైదే. పాదం – 49,50
9. పైదే. పాదం – 29
10. పైదే. పాదం – 51

సంబంధించినవిగా ఉండడాన్ని చూపిస్తున్నాడు. ఇంకా,

*"భూమిలోని ప్రతి ప్రాణిని దైవంగా భావిస్తే*
*భార్యకూడ దైవమే కదా! ఓ అజ్ఞానులారా!"* [11]

అని ప్రశ్నిస్తున్నారు. ప్రేమ అంటే తప్పుగా భావించే కొంతమంది మూఢులను కూడ వదలి పెట్టలేదు.

*నాటకంలో, కావ్యంలో ప్రేమ అంటే*
*ప్రజలంతా ఆశ్చర్యంతో బాగుంది అంటారు;*
*ఆఫీసులో, ఇంట్లో, బావిదగ్గర, ఊళ్లో*
*ప్రేమ అంటే మండి పడతారు*
*పాడెకట్టి దాన్ని చంపడానికి మార్గం వెతుకుతారు*
*ప్రపంచంలో ప్రేమ అనే పంటను మాయం చేయడానికి*
*మూర్ఖులందరూ అసూయతో నిబంధనలు విధించి*
*విధి విధానాలు చేస్తూ అడ్డంకులు పెట్టి చెడిపోతున్నారే.* [12]

అనే కవితలో దీన్ని చూసి ఆనందించవచ్చు.

ప్రణయరీతులను చక్కగా ఆపోశన పెట్టిన వారు భారతియార్. ఈ సంప్రదాయాలను తన కవితల్లో పేరుపెట్టి చెప్పకపోయినప్పటికీ ఇవి వీరి కవితల్లో చోటు చేసుకోనుండడం చూడవచ్చు. ప్రాచీన రచయితలు ప్రణయ పద్ధతిని సంగమమని, శీలమని రెండురకాలుగా వేరుపరిచి చూపించారు. ప్రేయసి, ప్రియుడు తాము ఒకరికొకరు తమకు పూర్వ

11. పైదే. పాదం - 45
12. పైదే. పాదం - 52

పరిచయం లేకపోయినప్పటికీ తొల్కాప్పియర్ చెప్పే "బాలతాణైయాల్"[13] ఒకటి రెండుచోట్ల కలుసుకొని ప్రేమను పంచుకుంటారు. సంభోగసుఖంలో ఓలలాడుతారు. దీనిని (కళవు) 'సమాగమం' అని 'అగం' రీతి ప్రణయం దీనికి లక్షణాన్ని నిర్దేశించింది. ఈ విధంగా సమాగమం ద్వారా ప్రేమికులైనవారు తరువాత ఊరందరికీ తెలిసేలాగ పెళ్లి చేసుకుంటారు. దీనినే (కర్పు) 'శీలం' అంటారు. మొదట సమాగమం 'కళవు' ద్వారా కలుసుకొని తరువాత పెళ్లి చేసుకొని జీవితమనే సౌశీల్య పద్ధతిని స్వీకరించడమే "సమాగమం ద్వారా వచ్చిన సౌశీల్యం" (కళవిన్ విన్ వ**ళి** వంద కఱ్పు) అని చెప్పబడుతుంది. సమాగమం జరగకుండా మొదటే పెళ్లి జరిగి భార్యభర్తలుగా జీవించే పద్ధతి కూడ ఆకాలంలో ఉండేది. దీనిని "సమాగమం పద్ధతి ద్వారా రాని సౌశీల్యం" (కళవిన్ వ**ళి** వరాదు కఱ్పు) అని చెబుతారు.

***శాస్త్రాలు మాట్లాడుతున్నావు - కణ్ణమ్మా!***
***శాస్త్రాలు ఎందుకే!***
***ఆత్రగాళ్లకే అది కణ్ణమ్మా!***
***శాస్త్రాలు ఉన్నాయి!***
***పెద్దవాళ్ల సమ్మతంతో వధువు***
***సంప్రదాయాలు తరువాత చేద్దాం;***
***కాచుకోనుంటాను ఓ పిల్లా! ఇదో చూడు***
***బుగ్గలమీద ఒక ముద్దు.***[14]

---

13. తొల్ కాప్పియం, పొరుళ్, కళవు - 2

14. కణ్ణమ్మ - ఎన్ కాదలి - (1) - 3

అనే గేయంలోని పంక్తుల మధ్య ఈ రెండు పద్ధతులను భారతియార్ పేర్కొని ఉండడం చూడవచ్చు. 'వధువు' అనేది సౌశీల్యపద్ధతి. 'బుగ్గలమీద ఒక ముద్దు' అనేది సమాగమం పద్ధతి ప్రారంభం.

సంగ సాహిత్యంలో సమాగమం ద్వారా ఏర్పడిన వైవాహిక బంధమే శ్రేష్ఠమైనదిగా ప్రశంసించి ఉన్నారు. యౌవనదశకు చేరుకున్న యువతీ యువకుల మోహానుభూతులను 'ప్రేమ' అనీ 'కామం' అనీ రెండుపేర్లతో పిలుస్తూ వచ్చారు ప్రాచీనులు. ప్రారంభకాలంలో ఈ రెండుపదాలు ఒకే అర్థంలో వ్యవహరింపబడేవి. కాలం గడవగా 'కామం' అనే పదం నిమ్నార్థంలోనే పేర్కొనబడుతోంది. ప్రస్తుతం ఈ పదం శారీరక సంభోగాన్ని మాత్రమే సూచిస్తోంది. 'ప్రేమ' అనే పదం దైవీకమైన సంబంధాన్ని ఆత్మల సంయోజనాన్ని సూచిస్తోంది. తిరుక్కురళ్ కామవిభాగం (ఇన్బత్తుప్పాల్)లో కామం, ప్రేమ అనే రెండుపదాలు అర్థంలో ఎలాంటి భేదమూ లేక ప్రయోగించినట్లు చూడవచ్చు. భారతియార్ ఈ రెండుపదాల సూక్ష్మమైన అర్థాల భేదాన్ని తెలిసి సమర్థవంతంగా తన రచనల్లో ప్రయోగించారు.

ప్రేమ అనుభూతి అంటే ఏమిటి? ఒక పురుష హృదయము, ఒక స్త్రీ హృదయము సంగమించడానికి తహతహ లాడుతుండడమే ప్రేమ లేక ప్రణయం అని చెప్పబడుతుంది. నోటితో చెప్పలేని ప్రేయసీ ప్రియుల సంయోజన అనుభూతులను కవి ఒకదాని కొకటి ఆవశ్యకములైన అనుసంధానాల ద్వారా 'కణ్ణమ్మ నా ప్రేయసి' (6) అనే గేయంలో ఎంతో అద్భుతంగా వివరించిన తీరు ఎన్నో పర్యాయాలు చదివి చదివి అనుభవించాలి. ఈ గేయాన్ని అనుభవిస్తున్నపుడు కులశేఖరాళ్వారుల 'తిరుమాలై' అనుభవం మన జ్ఞాపకాలకు రాకుండా పోదు. తిరుమలలో

తనకు పక్షి, చేప, బంగారు పళ్లెరం, చంపకవృక్షం, పొదరు, సెలయేరు, కొండదారి, శ్రీమహావిష్ణువు గర్భగుడిలో ఉన్న మెట్లు– వీటిలో ఏది అయినప్పటికీ ఆ రూపం తనకు లభిస్తే చాలు అని అనుకునే ఆళ్వారు

*"శ్రీమహావిష్ణువు బంగారుకొండపై*
*ఏదైనా ఒకటి అయితే చాలు"*
*("ఎంబెరుమాన్ పొన్‌మలై మేల్*
*ఏదేనుం ఆవేనే")* [15]

అని చెబుతూ ఆఖరున "ఏదైనా ఒక వస్తువు" అని తన కోరికను అభివ్యక్తీకరించాడు. భారతియార్ కూడ తను పేర్కొన్న 'కణ్ణన్ పాట్టు'లో

*ధరణిలో, దేవలోకంలో*
*చేరిన ఆనందమంతా*
*ఒక రూపంగా ధరించావు!*
*హృదయామృతమా! కణ్ణమ్మా!* [16]

అనే భాగంలో ఈ లోకంలోనూ, దేవలోకంలోనూ ఉన్న ఆనందమంతా కణ్ణమ్మ అనే ఒక ఆకారంలో నిలిచి ఉందని చెబుతున్నారు. ఈ ప్రణయానుభూతి ప్రాచీన కావ్యాలను అధ్యయనం చేసే పద్ధతి భారతియార్‌కు తమ గేయాలలో ప్రణయం గురించి అద్భుతంగా ఆలోచించడానికి సహాయం చేసి ఉండాలని అనుకోవాల్సి ఉంటుంది.

యౌవనదశకు చేరుకున్న ఒక మగవాడు తన జీవితంలో ఎంతోమంది ఆడవాళ్లను చూసి ఉంటాడు. ఆ విధంగానే యౌవనదశకు

15. పెరుమాళ్ తిరుమొళి – 4 : 10
16. కణ్ణమ్మ – ఎన్ కాదలి (6) – 8

చేరుకున్న ఒక స్త్రీ ఎంతోమంది మగవాళ్లను చూసి ఉంటుంది. అందరి మీదా ప్రేమ ఏర్పడడం లేదు. కాని వీళ్లు విధి కారణంగా ఒక ఉద్యానవనంలో కలుసుకున్నప్పుడు ప్రణయానుభూతి వీళ్లమధ్య ఏర్పడుతుందని చెప్పడం కావ్య సంప్రదాయం.

***ఒన్ఱే వేఱే ఎన్ఱిరు పాల్‌వయిన్***
***ఒన్ఱి ఉయర్న్ద పాల దాణైయిన్***
***ఒత్త కిళివనుం కిళిత్తియుం కాణ్బ***
***మిక్కో నాయినుం కడివరై ఇన్ఱే.*** [17]

ఒకే ప్రాంతానికి గాని, వేరు వేరు ప్రాంతాలకు గాని చెందిన అనురూపులైన ఒక కన్య. ఒక యువకుడు విధివశాత్తు ఒకరినొకరు కలుసుకుంటారు. ఉభయుల శ్రేయస్సుపై ఆసక్తి కలిగినది సర్వోత్తమమైన ఆ విధి. ఆ ఇరువురిలో కన్య కన్నా యువకునికి ఎక్కువ వయసు ఉన్నప్పటికీ అది దోషం కాదు. అని తొల్కాప్పియర్ సూత్రీకరించాడు. దీనిని ఈ రచయిత ఒక విధి విధానంగానే – వ్యాకరణ సూత్రం ప్రకారమేకాక తల విధి కూడ అని చెబుతారు. దీనికి వ్యాఖ్యానం రచించిన ఇళం బూరణార్ కూడ కామ సంఘటనకు సంబంధించి పరస్పరం ప్రణయాభిముఖులై సంభోగించడం మంచి విధి కారణంగా తప్ప రాదు అనేది భావం" అని వివరించాడు. ఈ సంప్రదాయాన్నే ఇఱైయనార్ ప్రణయ ఘట్టంలోనూ

***అదువే, దానే అవళే తమియర్ కాణ***
***క్కామ పుణర్చి ఇరువయిన్ ఒత్తల్*** [18]

---

17. తొల్ కాప్పియం – పొరుళ్. కళవియల్ – 2
18. ఇఱైయనార్. కళవియల్. నూర్పా – 2

అని సూత్రీకరించి చెప్పాడు. దీనికి వివరణ రచించిన వారు కూడ ఈ సంప్రదాయాన్ని మిక్కిలి చక్కగా, స్పష్టంగా వివరించారు. ఈ సంప్రదాయాన్ని, ఈ రీతిని భారతియార్ కూడ తన 'కుయిల్ పాట్టు'లో అనుసరించాడని చెప్పడంలో తప్పులేదు.

ఈ విధంగా అరణ్యానికి వేటాడ్డం కోసం స్నేహితులతో వచ్చిన యువకుడు, వేరొక పనిగా అదే అరణ్యానికి స్నేహితురాళ్లతో వచ్చిన యువతి పరస్పరం కలుసుకొన్న సమయంలో వాళ్లతో వచ్చినవాళ్లు వేర్వేరుగా విడివడి వెళ్లిపోయారని చెప్పడం ప్రేమకావ్యాలలో కనిపించే ఒక సంప్రదాయం. ఈ సంప్రదాయాన్ని ప్రణయ విభాగానికి వ్యాఖ్యానం రచించిన ఇఱైయనార్ స్పష్టంగా వివరించాడు.[19] ఈ సంప్రదాయం కురుందొగైలో [20] కూడ చూసి ఆనందించవచ్చు. తంజైవాణన్ కోవైలో "కుఱియిడత్తు ఉయ్‌త్తునీంగల్"[21] అనే విభాగంలో దీనిని సవిస్తారంగా వివరించి యున్నారు.

కోయిల పాటలో కూడ ఈ సంప్రదాయాన్ని చూడవచ్చు. కవి ఉద్యానవనంలో కోయిలను కలుసుకొన్నప్పుడు అక్కడున్న పక్షులన్నీ ఎగిరిపోతాయి. వీళ్ల సంభాషణ ముగిసే సమయంలో ఎగిరిపోయిన పక్షులన్నీ ఉద్యానవనానికి తిరిగి చేరుకుంటాయి. ప్రేయసి ప్రియులు పరస్పరం కలుసుకొని మాట్లాడడానికి ఏకాంతస్థలం చాలా అవసరమనే అంశాన్ని పక్షులు కూడ తెలుసుకోనున్నాయి అని కవిగారు సూచించడం అద్భుతం! చాలా చాలా అద్భుతం!!

'కోయిల పాట'లో "చూడగానే ప్రేమ" అనే పద్ధతి అనుసరించ

---

19. ఇఱైయనార్, కళవియల్. సూర్పా – 2లోని వ్యాఖ్యానం చూడండి.

20. కుఱుందొగై – 114

బడింది. కోయిల పూర్వజన్మ వృత్తాంతం గురించి చెప్పేటప్పుడు దీనిని చూడవచ్చు. 'చిన్నారి కోయిల' అనే పేరు కలిగిన కోయిల ఒకరోజు సాయంత్రం తన చెలికత్తెలతో అరణ్యంలో విహరిస్తూ ఉంటుంది. అప్పుడు చేర మహారాజు కుమారుడు వేటాడ్డం కోసం అరణ్యానికి వస్తాడు. ఇరువురూ ఒకరినొకరు చూసుకోవడం జరుగుతుంది. పరస్పరం ప్రేమలో మునిగిపోతారు. దీనిని

*చెలికత్తెలతో కలసి నీవు ఒక సాయంత్రం*
*మెరుపుతీగలు క్రీడించినట్లుగా*
*అడవిలో ఆనందంగా ఆడుకుంటూ ఉండగా*
*వేటాడ్డం కోసం వచ్చాడు చోళచక్రవర్తి*
*ముద్దుల కుమారుడు; సహచరుల తోడు*
*చెదరిపోగా కొదమజింకను తరుముకుంటూ వచ్చి*
*చెలికత్తెలతో ఆటలాడుతున్న నిన్ను చూశాడు,*
*తక్షణమే మోహపరవశుడయ్యాడు.*
*నిన్నే పెళ్లి చేసుకోవాలని నిశ్చయించాడు.*
*రాజకుమారుని చూడగానే మోహజలధిలో మునిగావు*
*నిన్ను అతడు చూశాడు; నీవు అతన్ని చూశావు*
*చూపులతోనే ఇరువురి ఆత్మలు సంగమించాయి.*[21]

ఇలాంటి ప్రణయ సంప్రదాయం తొల్కాప్పియర్ కాలంనుండి ఒక కావ్య సంప్రదాయంగా కొనసాగుతూ వస్తూ ఉంది. అగనానూరు,[22]

21. కుయిల్ పాట్టు. కుయిలిన్ ముఱ్పిఱప్పిన్ వరలాఱు పాదాలు. 61-72
22. అగనానూరు -48

కలిత్తొగై, పెరుంగద్దై, జీవక చింతామణి, కంబ రామాయణం మొదలైన గ్రంథాలలో ఇలాంటి సంప్రదాయంతో కూడిన ప్రణయం బీజంగా మొదలై వృద్ధి చెందడం చూడవచ్చు. కాని కురుందొగైలో ఇది అద్భుతంగా ఆవిష్కరింపబడింది.

*యాయుం ఞాయుం యారాగియరో*
*ఎందైయుం నుందైయుం ఎమ్ముఱై కేళిర్*
*యానుం నీయుం ఎవ్వాళి అఱిదుం*
*సెంబుల పెయనీర్ పోల*
*అన్బుడై నెంజం తాం గలందనవే* [23]

"నా తల్లి, నీ తల్లి ఏవిధంగా ఒకరి కొకరు తెలుసుకోనున్నారు? నా తండ్రి, నీ తండ్రి ఏవిధంగా బంధువులు? నేను నీవు ఏవిధంగా పూర్వం తెలుసుకోనున్నాము? వాననీరు ఎర్రమట్టి నేలలో పడి కలసి పోయినట్లుగా ప్రణయంతో కూడిన మన హృదయాలు తమంతట తామే సంగమించాయి."

ఇందులో బంధుత్వ సంబంధంగాని, స్నేహ సంబంధంగాని లేని రెండు హృదయాలు సహజంగానే ప్రణయంతో నిండి ఉండడమూ, ఈ ప్రణయం పెక్కు జన్మలలో వృద్ధిచెందుతూ ఫలించడం చూసి ఆనందించవచ్చు.

ప్రేమైక జీవితంలో భావావేశాల మధ్య ఒక పోరాటం జరగడం చూడవచ్చు. నమ్రతతో కూడిన స్వభావానికి పొంగులెత్తే ప్రణయ భావావేశాలకు మధ్య జరిగే పోరాటం ఇది. నాయకుని గుణగణాలైన బుద్ధి, మేలిమి గుణాలు, ఓర్పు, కార్యదక్షత అనే నాలుగు గుణాలు, నాయిక

23. కుఱుందొగై - 40

గుణగణాలైన సిగ్గు, భయము, మదం, పయిర్పు అనే నాలుగు గుణాలు వాళ్ల వాళ్లకు తగిన విధంగా వినయంగా పోరాడుతాయి. పురుష హృదయము, స్త్రీ హృదయము పరస్పరం కలుసుకొన్నప్పుడు "ఈ సిగ్గు, బిడియాలు పైబడగా ప్రవహిస్తున్న నదీజలాల పక్కనున్న గడ్డి వంగినట్లుగా వంగిపోతాయి. అంతేగాక తీవ్రమైన ఆకాంక్ష అన్ని అనుభూతులను తొలగించి అంతా తానే అయి ఇరువురినీ పునస్సంధానం చేస్తుంది.[24] అని కళవియల్ విభాగానికి వ్యాఖ్యానం రచించిన వారు ఈ భావావేశాల సంగమాన్ని అద్భుతంగా వర్ణించారు. ఈ విభాగంలోనే "కామప్పుణర్చి ఇరునయిల్ ఒత్తల్" అనే పద్యానికి ఇచ్చిన వివరణ చదివి ఆనందించ దగింది.

ఈ భావావేశాల పోరాటాన్ని – లజ్జకు సౌశీల్యానికి మధ్య జరిగే పోరాటాన్ని తొల్కాప్పియం పేర్కొని ఉంది. తిరుక్కురళ్ కూడ దీనిని వివరించి ఉంది.

*ఉయిరినుల సిఱందన్రు నాణే; నాణినుం*
*సెయిర్ దీర్ కాట్చి కఱ్పు చ్చిఱంద న్రైన*
*తొల్లోర్ కిళవి పుల్లియ నెంజమొడు*
*కామ క్కిళవన్ ఉళ్వళి కిళవి కిళప్పినుం*
*ఆవగై పిఱవుం దోన్రుమన్ పొరుళే*[25]

స్త్రీ సహజమైన లజ్జ ప్రాణాలకంటె ఉత్తమమనీ, లజ్జకంటె పాతివ్రత్యము ప్రధానమని పెద్దలు చెప్పిన మాటలను మనసులో గ్రహించిన

24. ఇఱైయనార్ – కళవియల్ – నూఱ్పా – 2 (వ్యాఖ్యానం చూడండి)

25. తొల్కాప్పియం – పొరుళ్ – కళవియల్ – నూఱ్పా. 23

నాయిక స్వయంగానే నాయకుడు ఉన్న ఆవాసానికి వెళ్తుంది. అంతేగాక అతనితో నిష్కళంకములైన మాటలు మాట్లాడుతుంది. అనే పద్య విభాగంలో తొల్కాప్పియర్ పేర్కొనడం చూడవచ్చు. తిరువళ్లువర్ మహాశయుడు కూడ

*కామం విడువొన్ట్రో నాణ్‌విడు నెంజే*
*యానో పొఱేనిన్ వ్విరండు* [26]

"ఓ మంచి హృదయమా! ప్రేమతో బాధపడ్డం వదలిపెట్టు. లేక ధైర్యంతో చెప్పలేకపోతున్న సిగ్గునైనా వదలిపెట్టు. ఈ రెండింటినీ ఓర్చుకునే శక్తి నాకు లేదు." అని నాయిక చెప్పడం చూడవచ్చు.

కలిత్తొగైలో నాయిక ప్రవర్తన కూడ ఈ సంప్రదాయాన్ని అనుసరించే ఉంది. ఒక నాయకుడు ఏనుగు మొదలైన వాటి అడుగులను వెతికిన విధంగా ఒక నాయికను చూసి ఆమెను చుట్టి చుట్టి వస్తుంటాడు. తనలోని ప్రేమరోగాన్ని సంకేతాల ద్వారా తెలియజేస్తుంటాడు. ఇలా కొన్నిరోజులు గడుస్తాయి. చాలా రోజులుగా దీన్ని చూస్తూ వచ్చిన నాయిక అతనితో సంబంధం లేకపోయినప్పటికీ విచారంలో మునిగిపోతుంది. అయినప్పటికీ నాయకుడు తన బాధను చెప్పడు. నాయిక కూడ నాయకుని అవస్థలకు తాను బాధపడుతున్నట్లు చెప్పడం స్త్రీ లక్షణం కాదని భావిస్తుంది. అయితే ఇలా రోజులు గడిచిపోతే నాయకుడు మరణించగలడని భావించి మధ్యలో ఒకరోజు నాయిక తనలో పేరుకోనున్న వేదన కారణంగా తెగించి సిగ్గులేని పని ఒకటి చేస్తుంది. ఒకరోజు 'తిణై' పంట పొలానికి చేరువనున్న ఉయ్యాలలో ఆడుకుంటూ ఉంటుంది. అప్పుడు అక్కడికి వచ్చిన నాయకుని చూసి ఉయ్యాల ఊపమని అడుగుతుంది. అతడు కూడ అంగీకరించి

26. కుఱళ్ – 1247 (నెంజొడు కిళత్తల్)

ఆవిధంగా ఊపుతాడు. నాయిక పొరబాటున చేతులు జారిపోయినట్లు అతని వక్షస్థలంపై వాలిపోతుంది. అతడు కూడ అది నిజమనుకొని నమ్మి వేగంగా ఆమెను ఆలింగనం చేసుకుంటాడు. నాయిక కూడ స్పృహ తప్పినట్లు అతనిపై పడి ఉంటుంది.[27] ఇందులో లజ్జకు, పాతివ్రత్యానికి మధ్య జరిగిన పోరాటాన్ని చూస్తున్నాము.

ఈ ప్రణయ సంప్రదాన్ని భారతియార్ కోయిల పాటలో అద్భుతంగా ప్రయోగించారు. కోయిల తన పూర్వజన్మ చరిత్రను పేర్కొంటున్నప్పుడు

***సంతోషంలో పూరించిపోయావు,***
***పెల్లుబుకిన సంతోషంలో***
***సిగ్గును పక్కకు పెట్టావు; నిన్ను నీవు మరిచావు***
***కంటికి కనిపించని ఆనంద స్వప్నంలో***
***మైమరిచావు, రాజకుమారుని ఆలింగనం చేసి***
***అతని అధరామృతాన్ని గ్రోలాలని అనుకున్నావు.***[28]

అని మునివరేణ్యులు చెప్పిన మాటలలో దీని గురించిన ప్రస్తావన కనిపిస్తుంది.

సాధారణంగా ప్రణయ సంభోగం జరిగిన తరువాత నాయకుడు "నిన్ను ఎన్నడూ ఎడబాయను; విడిచి ఉండలేను" అని చెప్పడం ప్రాచీనకాలం నుండి వస్తున్న కావ్య సంప్రదాయం. తంజైవాణన్ కోవై నాయకుడు

---

27. కలి - 37. (కుఱింజి క్కలి - 1)

28. కుయిల్ పాట్టు. కుయిలిన్ ముఱ్పిఱప్పు వరలాఱు. పాదాలు (108-114)

*ఓ స్త్రీ రత్నమా! ఎడబాయను,*

*క్షణమైనా నిన్ను ఎడబాయను* [29]

అని తన ప్రేయసి దగ్గర చెప్పడం చూడవచ్చు. ఇలాంటి సంప్రదాయాన్ని అనుసరించే కోయిలపాటలో కూడ

*"వేద పద్ధతిలో సాంగోపాంగంగా*

*వివాహం చేసుకుంటాను స్త్రీరత్నమా!*

*అంటూ కుడి చేయి చరిచి*

*ప్రమాణం చేశాడు"* [30]

అని చేర రాకుమారుడు చిన్నారి కోయిల దగ్గర వాగ్దానం చేయడం కవి పేర్కొన్నారు.

అంతేగాక సాధారణంగా స్త్రీలు తమ ప్రేమను ఇతరులకు గాని, ప్రియునికిగాని మాటలలో వ్యక్తీకరించే అలవాటు లేదు. దీనినే తొల్కాప్పియర్ కూడ

*తన్నుఱు వేట్కై కిళవన్ ముఴ్‌కిళత్తిల్*

*ఎణ్ణుంగాలై కిళత్తి క్కిల్లై* [31]

తనకు నాయకుని మీదున్న ప్రేమను నాయిక సంస్కారంలేని స్త్రీలవలె తన నాయకుని ఎదుట వెల్లడించదు. నిజమైన ప్రేమ అద్దంలో కనిపించే ప్రతిబింబంలాగ వ్యక్తమవుతూనే ఉంటుందనేది వ్యవహారంలో ఉన్న వాస్తవం. లక్షణ గ్రంథాలు కూడ దీనినే పేర్కొంటున్నాయి.

---

29. తంజైవాణన్ కోవై - 23

30. కుయిల్ పాట్టు. కుయిలిన్ ముఴ్‌పిఱప్పు వరలాఱు. పాదాలు (106-107)

31. తొల్ కాప్పియం - పొరుళ్ - కళవియల్. 28

*నాట్టం ఇరండుం అఱివుడం పడుత్తఱ్కు*
*కూట్టి ఉరైక్కుం కుఱిప్పురై యాగుం.*[32]

చూపులు రెండూ కలసి తమ హృదయాలను ఏకం చేయడం కలసిచెప్పే కామ సంకేతం అవుతుంది అని చెప్పే తొల్కాప్పియర్ మాటల్లో దీనిని చూడవచ్చు. ఈ ప్రేమ సూచనను తిరువళ్లువర్ కూడ

*"కణ్ణొడు కణ్ణిణై నోక్కొక్కిన్ వాయ్ చొఱ్కళ్*
*ఎన్న పయనుం ఇల"*[33]

"ప్రేమికుల కళ్లూ కళ్లు కలసినపుడు మాటలు అవసరం లేకుండా పోతుంది" అని వివరించాడు. దీనిని పెక్కు విధాలుగా

*ఇరునోక్కు ఇవళుణ్ కణ్ ఉళ్లదు ఒరునోక్కు*
*నోయ్ నోక్కు, ఒన్టు అన్నోయ్ మరుందు*[34]

ప్రేయసి కాటుక కళ్లల్లో రెండు రకాల చూపులు ఉన్నాయి. ఒకటి ప్రేమవ్యాధిని కలిగించే చూపు, మరొకటి ఆ వ్యాధికి మందునిచ్చే చూపు

*కణ్గళవు కొళ్లుం సిఱునోక్కం కామత్తిఱ్*
*సెంబాగం అన్టుబీ పెరిదు,*[35]

కొంటెతనంతో కూడుకొన్న కడకంటి చూపుతో ఆమె నన్ను చూస్తోంది. అది ప్రేమలో సగభాగం కాదు. అంతకు మించిన ప్రేమ ఉంది.

---

32. పైదే. పాదం. 93
33. తిరుక్కుఱళ్ – 1100
34. పైదే. పాదం. 1091, 1092, 1093
35. కంబ రామాయణం. బాలకాండం. మిథిలై – 35

*యానోక్కుం కాలై నిలన్ నోక్కుం, నోక్కాక్కాల్*
*తాన్ నోక్కి మెల్ల నగుం*[36]

నేను చూస్తున్నప్పుడు ఆమె వంగి నేలను చూస్తుంది. నేను చూడనపుడు ఆమె నన్నుచూసి మెల్లగా నవ్వుతుంది. ఇవి నామీద ఆమెకున్న ప్రేమగుర్తులు కావా?

– అని మూడు కురళ్ పద్యాలలో స్పష్టంగా పేర్కొన్నాడు. ప్రేమ నాటకంలో "సంకేతాలను తెలుసుకోవడం" వివిధ ప్రణయదశల్లో ఈ మూడు కురళ్ పద్యాలు అద్భుతంగా ఆవిష్కరించాయి. కంబ మహాకవి కూడ ఈ శ్రీరామచంద్రుడు సీతాదేవి ఇరువురూ ఒకరినొకరు చూసుకొని ప్రణయభావావేశానికి లోనయ్యారని సంకేతాల ప్రాముఖ్యత సూచించాడు.

*"అణ్ణలుం నోక్కినాన్ అవళుం నోక్కినాళ్–"*[37]
*"శ్రీరామచంద్రుడు చూశాడు, సీతాదేవి కూడ చూసింది–"*

ఒకరినొకరు కబళించి వేసేలా చూసిన చూపులు అనే దారంతో కట్టివేసి ఒకరి మనసు మరొకరి మనసును లాగింది. అందువల్ల వింటిని ధరించిన రాముడు, కత్తులవంటి నయనాలు కలిగిన సీతాదేవి ఇరువురూ ఒకరి హృదయంలోకి మరొకరు ప్రవేశించి ఆవాస మేర్పరచుకున్నారు. అని చెప్పాడు. కాని శూర్పణఖ రాముని దగ్గర తాను పొందిన కామావేశాన్ని తానే ఇతరుల దగ్గర చెప్పడం, ఉన్నత కులంలో జన్మించిన స్త్రీలకు ఉచితం కాదు. అయినప్పటికీ కామంతో దహించుకుపోతున్న హృదయం కలిగిన నాకు వేరెవరూ సహాయంగా లేరు. అందువల్ల నా కామాన్ని నేనే

---

36. పైదే. పాదం. 37
37. పైదే. పాదం. ఆరణి. శూర్పణగై – 45

చెప్పడం తప్ప నేను వేరేది చేయగలను? మన్మథుని క్రూరబాణాల నుండి నువ్వు నన్ను కాపాడాలి" అని తన ప్రేమను తెలియజేసే వేరొక సంప్రదాయాన్ని చూపించాడు కంబ మహాకవి.[38] ఇది సంగకాల సంప్రదాయాన్ని తోసిపుచ్చిన పద్ధతి అవుతుంది. ఈ కొత్త సంప్రదాయాన్ని స్వీకరించారు భారతియార్. భారతిగారికి నోరు తెరిచి చెప్పలేని రహస్య ప్రణయం గురించి తెలుసు. దాక్కోవడం, మరుగుపరచడం లాంటి ప్రేమచేష్టలు కూడ తెలుసు. ఈ ఇరు వేర్వేరు పద్ధతులను భారతియార్ తన గేయంలో చూపించి ఉన్నారు.

"ప్రేమబాధలో వాడిపోతున్నాను, ప్రేమలో పడ్డాను అనే వార్తను మహిళాలోకం బహిరంగంగా చెప్పే సంప్రదాయం లేదని తెలుసు"[39]

అని కోయిల మాడన్ దగ్గర మాట్లాడినట్లు రచించాడు. రెండో పద్ధతిలో మాడన్, కురంగన్ ఇరువురూ మాట్లాడడానికి పిశాచాల ఆకారాలు ధరించి కోయిల చుట్టూ తిరిగినట్లు

***"నిన్ను కోయిలగా చేసి నీవు వెళ్లే చోటుకంతా***
***నీతో కలసి తిరుగుతున్నాడు"***[40]

అంటూ కోయిల పూర్వజన్మ చరిత్రను చెబుతున్న మునివరేణ్యుని నోటిద్వారా పేర్కొనడం చూస్తున్నాము.

ప్రేమికులు కొన్ని సమయాల్లో తాము ప్రేమించిన వారి అవయవాల అందాలను వర్ణించడం కద్దు. కంబ మహాకవి ఆనవాలు

---

38. కుయిల్ పాట్టు. కుయిలిన్ - మాడుం - పాదం (59-70)
39. పైదే. పాదం. కుయిలిన్ ముఖ్పిఅప్పు వరలాఱు. పాదాలు (191-2)
40. కంబ రామాయణం. కిష్కింద - నాటవిట్ట. 33-40

కోసం చెప్పేటప్పుడు సీతాదేవి దేహ సౌందర్యాన్ని పాదాది కేశ పర్యంతం శ్రీరాముడు హనుమంతునికి చెప్పే సందర్భంలో కొన్ని పద్యాలు రచించాడు. ఈ విధంగానే హనుమంతుడు (భక్తుడు) సీతాదేవికి శ్రీరామచంద్రుని ఆనవాలు తెలియడం కోసం పాదాది కేశ పర్యంతం కొన్ని పద్యాలు రచించాడు.[41] దీనికి వ్యతిరేకంగా శూర్పణఖ రావణునికి సీతాదేవి మేని అందాలను వర్ణించి అతనికి సీతమీద విపరీత వ్యామోహం కలిగేలాగ పద్యాలను రచించాడు.[42] ఈ సంప్రదాయానికి మారుగా జీవక చింతామణిలో గోవిందన్ తన కుమార్తె శరీర సౌందర్యాన్ని జీవకునికి తెలియజేసే పద్ధతి కనిపిస్తుంది.[43]

ఈ పద్యంలో గొల్లవాడు తన కులానికి తగినట్లుగా తనకు తెలిసిన వస్తువులతోనే గోవిందునికి ఉపమానాలుగా చెప్పిన తీరు ప్రశంసించ దగింది. కోయిల పాటలో కోయిల జ్యోతి అమ్మాయిగా మారిన తరువాత ఆమె అందాలను,

> *"................... కవితా ఫలాన్ని పిండిన*
> *రసంలో, ఛందోభేదాలతో కూడిన రాగాల సారమంతా*
> *చేర్చి, దానిలో అమృతాన్ని కలిపి*
> *ప్రేమ అనే ఎండలో ఎండబెట్టగా ఏర్పడిన గడ్డలచే*
> *మాధవుని శరీరాన్ని తయారుచేశాడు బ్రహ్మ"*[44]

అని చవులూరే కవితలో వర్ణిస్తాడు. ఈ సంప్రదాయం వళ్లలార్ తిల్లై

41. పైదే. పాదం. సుందర ఉరుక్కాట్టు 39-58
42. పైదే. పాదం. ఆరణ్య. మారీచన్ కదై 69-74
43. జీవక చింతామణి. గోవిందైయార్ ఇళంబగం - 480
44. కుయిల్ పాట్టు : కుయిలిన్ ముఱ్పిఱప్పు వరలాఱు. పాదాలు (241-45)

చిదంబరంలో నాట్యం చేసే నటరాజస్వామిని వర్ణించే సందర్భంలో

*ఎంపిక చేసిన బాగాపండిన ఫలాలను పిండి వడగట్టి*
*చక్కెర, కలకండ పొడివేసి కలియబెట్టి*
*అందులో తేనెను పోసి, ఆవుపాలను*
*మీగడను గుబాళిస్తున్న నెయ్యిని*
*కలిపి మితమైన వేడిలో దించి*
*పెట్టిన ఆ రుచికన్నా ఎంతో రుచికరమైంది"* [45]

అనే పద్యంలో ఈ సంప్రదాయం కలగలసి ఉండడం చూసి ఆనందించవచ్చు. వళ్లలార్ భక్త్యావేశాలతో చెప్పిన సంప్రదాయాన్ని భారతియార్ ప్రేమతత్వానికి తగిన విధంగా రూపొందించుకున్నారు. ప్రణయము, భక్తి స్థలాలుమారి వెళ్లినప్పటికీ ఆలోచించినపుడు ఒకే రకమైన భావావేశాలే కదా!

---

45. ఆఱామ్ తిరుముఱై – అరుళ్ విళక్క మాలై – 4106.

# అధ్యాయం - 5

# గేయంలో ప్రకృతి అందాలు

ప్రకృతిలోని సమస్త వస్తువులు ఆనందకరమైన సమాధిలో లీనమై ఉంటాయి. మనతో మాట్లాడడం కూడ తమ ఆనందానికి అడ్డంకి అని అవి భావిస్తుంటాయి. వాటి ప్రశాంతతను భగ్నం చేయకుండా ఉండడమే మన ధర్మం అవుతుంది. ఆ ప్రశాంతతలో మనం కలిసిపోవాలి. ఆవిధంగా మమేకమైపోయే స్వభావం గలవాడే కవి. అతను ప్రకృతితో మెలగే సామర్థ్యం కలిగినవాడు. ప్రకృతిని అతను అనుభవించే పద్ధతే ప్రత్యేకంగా ఉంటుంది. నిద్రపోతున్న దశలో తల్లి తన బిడ్డను తన ఎదకు హత్తుకోవడం మనం గమనించి ఉన్నాము కదా! తన వక్షస్థలంలోకి చేర్చుకొని బిడ్డను కౌగలించుకుంటుంది. ఇలా చేసినప్పటికీ బిడ్డ నిద్ర చెడదు. మరుక్షణంలో ఆమె కూడ తన్ను తాను మరిచి నిద్రపోతుంది. ఆవిధంగానే కవికూడ ప్రకృతిని దాని ఆనందమయమైన ప్రశాంతతకు భగ్నం కలగకుండా ఆలింగనం చేసుకుంటాడు. తనను తాను వెంటనే మరిచిపోతాడు. ఆనందసాగరంలో ఓలలాడుతాడు. దానిలో నుండి బయటపడగానే పిచ్చి పట్టిన వాడివలె కొన్ని సమయాల్లో పాటలు పాడుతుంటాడు. కొన్ని సమయాల్లో నాట్యం చేస్తాడు. ఇవన్నీ కళలుగా మారిపోతున్నాయి. అతడు అనుభవించిన ఆనందపు వెల్లువలో ఒకటి రెండు బిందువులు అతను పాడిన పాటలోనూ, ఆడిన నాట్యంలోనూ కలగలసి పోతుంటాయి. దానిని చూసి "కళలు! కళలు!" అని ఆనందంతో హృదయంలో పొంగిపో తుంటాము. కాబట్టి మనం ప్రపంచంలో ఉన్నవాళ్లకు మూలంగా నిలిచే ఆనందపు టెల్లువలో ఏకమై జీవించాలి. అదే మనల్ని ఉన్నతులుగా చేస్తుంది.

మనకు హృదయంలో ప్రశాంతతను కలుగజేస్తుంది. మనకు తెలియకనే మన హృదయం అన్వేషించే వస్తువు అదే అవుతుంది.

భారతియార్ గారి గేయాలను క్షుణ్ణంగా పరిశీలిస్తే, ఆయన ప్రకృతి అందంలో మైమరచిన ఒక మహాకవి అనేది అర్థమవుతుంది. సూర్యుడు,[1] వెన్నెల,[2] నక్షత్రాలు,[3] గాలి,[4] వాన[5] మొదలైన అంశాలను గురించి పాడిన గేయాల్లో ప్రకృతి అందాలమీద వారికున్న ప్రేమ తెలియవస్తుంది. కవిగారి ప్రాతఃకాల కల్పనలు, సంధ్యాకాల వర్ణనలు, సూర్యోదయ దృశ్యాలు వీటిని బలపరుస్తున్నాయి. కోయిలపాటలో సైతం వారి ప్రకృతి అందాల కల్పనలను చూసి ఆనందించవచ్చు. కోయిల పాట ప్రాతఃకాల కల్పనతోనే ప్రారంభమవుతుంది. ఉదయం సూర్యుడు తన లేత కిరణాలను నల్లని సముద్రంపై ప్రసరింప చేస్తున్నాడు. సముద్రం మంటలకు ఎదురుగా కనిపించే నీలమణిలాగ కాంతులు ప్రసరింపజేసి – సమ్మోహనంగా జ్యోతిస్వరూపంగా కళ్లకు ఆకర్షణీయంగా దర్శనమిస్తుంది. అంతేగాక సముద్రం కూడ వేగంగా వీచే అలల ద్వారా వేదాలను ఘోషించినట్లు అనిపిస్తుంది కవిగారికి. గాలిని, సముద్రాన్ని కలగలిపి కవిగారు అద్భుతంగా గానం చేశారు. వాటిలో కొన్ని పంక్తులు.

*"సముద్రమే గాలిని వ్యాపింపజేస్తూ ఉంది*
*వేడి అధికంగా ఉన్న ప్రదేశాలనుండి*

---

1. తో. పా. సూరియ దరిసనం, ఞాయిఱు వణక్కం చూడండి.
2. సోమదేవన్ పుగళ్ – వెణ్ణిలావే చూడండి.
3. త. పా. నిలావుం వాన్ మీనుం కాట్రుం.
4. పై. పుయఱ్ కాట్రు.
5. పై. మళైఎన్ష పాడల్.

*వేడి తక్కువగా ఉన్న ప్రదేశాలకు*
*గాలి పరిగెత్తుకుంటూ వస్తుంది.*
*ఆవిధంగా పరిగెత్తుకుంటూ వస్తున్నప్పుడు*
*గాలి మేఘాలను కూడ తీసుకువస్తుంది*
*మనకు వచ్చే వాన సముద్రతీరాల నుండే వస్తుంది*
*ఓ గాలీ! ప్రాణాధారమైన సముద్రం నుండి మాకు*
*ప్రాణాధారమైన వానను తీసుకురా!* [6]
*ఓ గాలీ! నీవే మాకు ప్రత్యక్షమైన బ్రహ్మ* [7]
*నమస్తే వాయుదేవా! త్వమేయ ప్రత్యక్షం బ్రహ్మోసి* [8]

కవి మనకు వేద మంత్రాన్ని ఉచ్చరిస్తున్నప్పుడు మన శరీరం పులకాంకిత మవుతుంది. "గాలి మనకు యుగాంతమవుతుంది, గాలే మనల్ని రక్షిస్తుంది." [9]

*భీముడు, హనుమంతుడు*
*వాయువు బిడ్డలని పురాణాలు చెబుతాయి*
*ప్రాణాలతో ఉన్నవన్నీ గాలి*
*బిడ్డలేనని చెబుతుంది వేదం*
*ప్రాణమే గాలి*
*ప్రాణం పదార్థం; గాలి దాని క్రియ* [10]

6. వచన కవితైగళ్ – 4. కడల్ (2)
7. పై. కాట్రు (1)
8. పై. కాట్రు (2)
9. పై. కాట్రు (2)
10. పై. కాట్రు (5)

దీని కారణంగానే కవి “సముద్రం తన వేగమైన తరంగాలచే వేదాలను ఉచ్చారణ చేసి” అని ‘కోయిల పాట’ ప్రారంభంలో గానం చేశారని భావించవచ్చు.

కోయిల పాటలో కోయిల తన ప్రేమకథను చెబుతున్నప్పుడు

*బుద్ధి, ఆకారము సంకోచించి, అవనిలో*
*చిన్నారి పక్షిగా జన్మించాలి*
*దేవతల కరుణతోనో లేక దైవానుగ్రహంతోనో*
*సకలభాషలు సులభంగా అర్థం చేసుకునే భాగ్యం పొందాను*
*మానవుల హృదయావేదనలన్నీ తెలుసుకున్నాను.*[11]

అని తనకు కలిగిన గొప్ప భాగ్యాన్ని చూపించి తాను మధురమైనసంగీతంలో తన మనసును ధారపోశానని చెప్పుకున్నది.

*గాన విహంగము గల గలమనే శబ్దంలోనూ*
*గాలి చెట్లమధ్య చూపించే రాగాల్లోనూ*
*నదీజలాల, జలపాతాల శబ్దాలలోనూ*
*నీలి కడలి సదా తాను వినిపించే సంగీతంలోనూ*
*రోదన శబ్దాల్లో ఉదయించే సంగీతంలోనూ*
*మానవస్త్రీలు ప్రణయం కారణంగా*
*హృదయం ద్రవించేలా పాడ్డంలో కరిగిపోయాను,*
*కపిలపాటల్లోని సంగీతంలోనూ,*
*వడ్లు దంచే రోకటి పాటల్లోనూ*

11. కుయిల్ పాట్టు. కుయిలిన్ కాదల్ కదై (పాదం - 23-27)

*సున్నం దంచేవాళ్ల మధురమైన రాగాల్లోనూ*
*పంటపొలాల్లో పడతులు పాడే పాటల్లోనూ*
*వలయాకారంగా తిరిగే వనితలు*
*చేతి గాజులు గలగలమనగా*
*గొబ్బిళ్లు కొడుతూ గుంపుగా పాడే పాటల్లోనూ*
*పిల్లనగ్రోవి, వీణ మొదలుకొని మానవుల గొంతుల్లోనూ,*
*చేత్తో వాయించే పెక్కు వాయిద్యాల్లోనూ*
*దేశంలో, అరణ్యంలో రోజంతా ధ్వనించే*
*పాటల్లోనూ హృదయాన్ని దారపోసుకున్న పాపిని నేను,*
*నాలుక పలికే తడబడే మాటలను*
*పాపిష్ఠి మనసు గట్టిగా పట్టుకొని నిలవదెందుకో* [12]

ఈ ఘట్టంలో ప్రకృతి కలిగించే పలు రకాలైన ధ్వనులన్నీ రంగు రంగు దృశ్యాలుగా చూపిస్తున్నట్లు ఒకచోట చూపించి కవి మనల్ని ఆనందింపజేశాడు. సంగీత మాధుర్యంతో కూడిన ఈ పాదాలు కర్ణపేయములై గేయం విలువను ఎన్నోరెట్లు ఉన్నతీకరిస్తోంది.

ఈ అంశాన్ని రాస్తున్నప్పుడు కవికి శిలప్పదిగారం కావ్యం సహాయం చేసి ఉంటుందని భావించవచ్చు.

*హృదయాన్ని కదిలించేది శిలప్పదిగారమంటారు–*
*మణిహారం అందించిన తమిళనాడు* [13]

అని గానం చేశారు కదా! కోవలుడు, కణ్ణగి ఇరువురూ కవుంది

12. పైదే. పాదం (28–46)

13. దేశీయ గీతం. సెందమిళ్‌నాడు–7

అడిగళుతో మదురై దిశగా వెళ్తున్నారు. కావేరినదీ జలాల శబ్దం వీళ్ల చెవుల్లో పడుతుంది. ఇదే కాక రకరకాల శబ్దాలు నడిచేవాళ్లకు అలసటను మరిచిపోయేలా చేస్తున్నాయి అని చెబుతున్నారు ఇళంగో వడిగళ్. ఈ శబ్దాలను అతను

*ఎర్రవడ్ల పంట పొలాలు, ఏపుగా పెరిగిన చెరుకుతోటలు*
*పంటకాలువల్లో పచ్చని ఆకులతో కూడిన తామర పుష్పాలు*
*సంపెంగ కోడి, పొడవాటి ముక్కుతో కనిపించే కొక్కెర*
*ఎర్రని కాళ్లున్న హంస, పచ్చని కాళ్లు కలిగిన కొంగ*
*అడవి కోడి, నీటిలో ఈదులాడే నీళ్లకాకి*
*ఇలా పలురకాల జల పక్షుల కల కలరావాలు*
*శత్రురాజుల సైన్యాలు తెగబడి యుద్ధం చేస్తున్నపుడు*
*పెల్లుబికే రకరకాల శబ్దాల లాగ సదా*
*వినిపించే శబ్దాలు ఒకవైపు;*

*బురద గుంతలోపడి దొర్లుతున్న ఎనుములు*
*మేట వేసిన వరిపైరు కుప్పల తాళ్లను*
*ఒరుసుకుంటూ వెళ్లగా, వడ్లగింజలు*
*అంతటా చెదరిపడగా, రైతులందరూ*
*గట్టిగా కేకలు పెట్టి ఎనుములను తరిమే*
*శబ్దాలు ఒకవైపు;*

*పల్లెపడుచులు కొందరు పంటపొలాల్లో*
*కలుపుతీస్తూ, మరికొందరు వరినారు*

*నాటుతూ శరీరమంతటా బురద చిందగా*
*కల్లుతాగి ఎర్రబడిన కన్నులతో ఆనందంగా*
*పాడుకుంటున్న పల్లెపదాల శబ్దాలు ఒకవైపు;*

*నేలను పగులగొట్టేవారిలాగ మడకలతో*
*పొలాలను దున్నుతున్న రైతులు పాడుతున్న*
*ఏరువాక పాటల శబ్దాలు ఒకవైపు;*
*వరిపైరు కోసి, కుప్పగా పేర్చి, తాళుకొట్టి,*
*రాలిన వడ్లను చేటలో తూర్పారబోస్తూ*
*పాడుతున్న పంటనూర్పెడు పాటల శబ్దం ఒకవైపు;*

*భట్రాజులు ఆవేశంతో పంబ వాయిద్యాన్ని*
*వాయించగా వెలువడే మధురమైన శబ్దాలు ఒకవైపు;*

*ఇలా రకరకాల శబ్దాలను ఆసక్తిగా ఆలకిస్తూ*
*కోవలుడు, కణ్ణగి, కౌంతి సన్యాసిని ముప్పురూ*
*నదీతీరం గుండా ఎలాంటి విచారమూ లేకుండా*
*నడుచుకుంటూ పయనం సాగించారు.*[14]

అని వర్ణించాడు ఇళంగో వడిగళ్. ఈ శబ్దాలను వింటూ కోవలుడు, కణ్ణగి కాళ్లనొప్పులు మరిచి వెళ్లారు అనేది కవి మనకు అందించే సూచన.

---

14. శిలప్పదిగారం. నాడుకాణ్. పాదాలు. (112–141)

"చీకటి – వెలుతురు" అనే కోయిలపాట భాగంలో ప్రాతఃకాల కల్పన దృశ్యాన్ని వ్యక్తీకరిస్తున్న కవి "ప్రాతఃకాల ప్రభాకరుని అందాలను, కల్పనలను గానం చేస్తాను" అని ప్రారంభించి

*బంగారాన్ని కొలిమిలో కరిగించి*
*అంతటా పూసినది ఒక ...*
*వినువీధిలో జ్యోతిమయంగా వెలిగే వింతను*
*ప్రస్తుతించేవారు ఉపమానాన్ని ఒకటి చూడగలరా?* [15]

అని గానం చేశాడు. ఈ పాటలో గానం చేయడం, ప్రస్తుతించడం, శ్రవణ ప్రతిబింబాలు (Auditory images) కరిగించడం, విస్తరింపజేయడం ఇవి (Kinaesthetic images) బంగారం, వినువీధి, జ్యోతి, కిరణాలు ఇవి దృశ్య ప్రతిబింబాలు (Visual images), స్నిగ్ధసాంద్రతను పలుచన చేయడం (Tactual images) మాధుర్యంగా రూపొందించడం (Gustatory images)

ఈ అయిదు రకాల ప్రతిబింబాలు కలగలసిన విరాట్ స్వరూపంగా ఉదయించే సూర్యుని అందాలను చూసి 'పళని పంచామృతం' లాగ మధురమైన దృశ్యంగా రూపొందింది.[16] దీని తరువాత వచ్చే కవితా పంక్తులు.

*"కణ్ణైయిని తోన్నురైప్పార్; కణ్ణుక్కు కణ్ణాగి*
*విణ్ణై అళక్కు మొళి మేంబడుమో? ఇన్బమన్నో?..."* [17]

---

15. కుయిల్ పాట్టు. ఇరుళుం. ఒళియుం. పాదాలు. (31–34)
16. ప్రతీకలకు సంబంధించి ఇంకా తెలుసుకోవాలని అనుకునేవాళ్లు ఈ రచయిత రచించిన "భారతీయం" అనే గ్రంథంలో (10. వ్యాసం) చదివి తెలుసుకోవచ్చు. (పళనియప్పా బ్రదర్స్, చెన్నై–14, తిరుచ్చి–21)
17. కుయిల్ పాట్టు – పాదాలు. 35–44

వినువీధిని జ్యోతి స్వరూపంగా చేసిన అద్భుతానికి ఉపమానం ఏదైనా ఉంటుందా? అనే ప్రశ్నను కవి లేవనెత్తుతున్నారు. మనం ఆలోచించి చూస్తే నిజానికి దానికి ఒక ఉపమానం చూడడానికి వీలు కాదని అవగతమవుతుంది. కాని

*"మూల పదార్థాన్ని మనసులో ధ్యానం చేసే*
*దేవతలు కూడ"*

అని యోగుల హృదయాలలో కనిపించే "పరంజ్యోతి"ని కవి ఉపమానంగా చెప్పవచ్చునని చెబుతున్నాడు. ఈ దివ్యమైన జ్యోతి తప్ప "అద్భుతమైన ఈ జ్యోతికి" వేరొక వస్తువును ఉపమానంగా చూపించడానికి వీలుకాదని పూర్వం పేర్కొన్న అంశాన్నే మళ్లీ పేర్కొంటున్నారు.

భారతియార్ ప్రత్యేకత ఏమిటంటే అది వారికున్న మానవ అనుభూతేనని చెప్పాలి. మానవజాతి మీద వారికున్న అంతులేని ప్రేమే దీనికి కారణం.

*"మానవులందరికీ శోకం లేకుండా చేస్తాను*
*పేదరికం అనేది భూమిలో లేకుండా మాయం చేస్తాను"* [18]

అనే కవితా పంక్తుల్లో ఈ ప్రేమను చూడవచ్చు. భారతిగారి హృదయం ఒక ప్రకృతి చిత్రీకరణ మీద మాత్రమే అధికంగా లీనం కాలేదు. మానవ రూపానికి ఒక ఆభరణంగా విరాజిల్లని ప్రకృతి చిత్రీకరణవైపు వారి మనసు లగ్నం కాలేదు. మానవ సమాజానికి చెందిన భావావేశాలను చూస్తున్నపుడు వారు తన చుట్టూ ఆవరించి ఉన్న ప్రకృతి దృశ్యాలలోనూ ఆ భావావేశాల ప్రతిఫలనాలను చూడ్డానికి ప్రయత్నించారు. ప్రకృతిని తమ

18. తొ. పా. హే. కాళీ! – 1

కవితలలో మేళవించి ప్రత్యక్షీకరించడంలో ఒక్కొక్క కవీ ఒక్కొక్క తీరులో వ్యవహరించారు. ఒకరు ప్రకృతిని ఒక ప్రపంచంగా చూశారు. వీరు దాని అందాలలో మునిగి తన్ను తాను మరిచిపోతారు. భారతిదాసన్ 'అందం' గురించి చెప్పే కవితలు[19] ఈ వర్గానికి చెందినవి. మరొకరు ప్రకృతిని తన కల్పనల మూలంగా మరోసారి సృష్టించి ఆ రచనలను చూసి మిక్కిలి ఆనందిస్తారు. భారతిదాసన్ నీలవాన్ ఆడైక్కుళ్ [20] (నీలివస్త్రంలోపల) అని ప్రారంభమయ్యే గేయం ఈ విభాగానికి చెందింది. వీరు ప్రకృతిలోని ప్రతి అంగాన్ని వర్ణించి ఆనందించారు. మరొకరు ప్రకృతి అందాలలో చిక్కుకొనక దానిని మానవుల భావావేశాల నేపథ్యంగా భావించి గేయాలను రచించారు. ఈ విభాగానికి చెందినవారు భారతియార్. "ఎన్నికోట్ల ఆనందాలు దాచి ఉంచావు?" ("ఎత్తనైకోడి ఇన్బం వైత్తాయ్") [21] అనే గానానుకూల గేయం దీనికి ఉదాహరణగా పేర్కొనవచ్చు. కోయిల పాటను కూడ దీనికి దృష్టాంతంగా పేర్కొనవచ్చు. మానవుల భావావేశాలతో ప్రకృతిని అనుసంధానం చేసి చూపించినపుడే భారతిగారి నూతన కళాభినివేశం జ్యోతిస్వరూపంగా విరాజిల్లుతుంది.

---

19. అళగిన్ సిరిప్పు.
20. 'పురచ్చి కవి'
21. తొ. పా. ఇళైవా ఇతైవా.

# అధ్యాయం - 6

## గేయంలో సంగీత ప్రకర్షణము

*సంగీతం*
*వ్యవస్థీకరింపబడిన శబ్దం*
*అదే సమయంలో*
*ఆత్మతో సంభాషించే*
*అంతరంగ భాష*
*......................*
*సంగీతం*
*చెవులకు*
*కప్పబడుతున్న*
*గౌరవ బంగారు శాలువాలు*
*సంగీతాన్ని*
*మొట్ట మొదట ఈ లోకంలో*
*కనిపెట్టిన విజ్ఞాని*
*గాలి*

*ఆ గాలి*
*సంరక్షించేవారు లేక*
*అడవిలో పెరిగిన*
*వెదురును కూడ మనం*
*ముద్దుపెట్టేలా చేసింది!*

1. ఊర్వలం – ఇస్సై. పుటలు. (17–18)

సంగీతం గురించి ఒక ఆధునిక కవిత ఇలా పేర్కొంది. *మామిడితోటలో కోయిల,*

*"ప్రేమ, ప్రేమ, ప్రేమ*
*ప్రేమపోతే, ప్రేమపోతే*
*చావు, చావు, చావు"*

అని ప్రారంభమైన కోయిల పాటను కవి "మోహనగానం" అని పేర్కొన్నారు. దీనికి కారణం

*వేటగాడు రాని విందురోజుల్లో*
*ఆడకోయిల ఒకటి, చిటారు కొమ్మలో*
*కూర్చోనున్న మగకోయిలల శరీరాలు పులకాంకితం కాగా*
*చేష్టలు మరిచి, హృదయంలో వేడి వృద్ధి చెందగా*
*తోటలోని పక్షులన్నీ గుంపుగా చేరి పరవశంగా*
*ప్రాతఃకాల కాలకృత్యాలలో నిమగ్నం కాకుండా వింటూ*
*అమృతం గాలిలో అంతటా కలిసిపోయినట్లు*
*మెల్లగా, మృదువుగా, మధురంగా*
*వచ్చి వ్యాపించినట్లు, దేవలోకంలోని దివ్యకాంత*
*ఇలాంటి రూపం ధరించి విరాజిల్లినట్లు*
*మధురమైన గానం పాడబడుతున్న అద్భుతాన్ని*

కవి ఆలకించి అనుభవించాడు. అందువల్లనే ఆ కోయిల

*"... మహదానందం కలిగించే గాయనివి!*

---

2. కుయిల్ పాట్టు.1 కుయిల్. పాదాలు.(11-21)

*ఏడేడు లోకాలను ఆనందాబ్ధిలో ఓలలాడించే*
*సామర్థ్యం కలిగిన దానివి!"*

అని ప్రశంసించారు.

భారతియార్‌కు "సంగీతం పిచ్చి" ఉంది. సంగీతానికి కరగనివాళ్ళు ఎవరు?

*"అడవిలోని జంతువుకు తెలుసు;*
*చిన్నారి శిశువుకు తెలుసు,*
*పాటలోని మాధుర్యం*
*పాముకు తెలుసు అని చెబుతారు"* [3]

అని కవిగారే పేర్కొన్నారు. 'మాయ కోయిల' పాతబడిపోయిన ఒక పాత పాటను ఎనిమిది దిక్కుల్లో ఆనందవార్ధిలో లీనమయ్యేలా పాడుతుండడం విన్నారు. ఆ సంగీతంలో తన హృదయాన్ని ధారపోసుకున్నారు.

*పాట ముగిసేవరకు ప్రపంచం తెలియలేదు;*
*ఆకాశం తెలియలేదు,*
*ఏపుగా నిలబడిన మహావృక్షాలు తెలియలేదు,*
*నన్ను మరిచాను, ఎదుటివాళ్లను మరిచాను*
*బంగారం వంటి గొంతులో పొంగిలేచే*
*మాధుర్య మొక్కటే చూశాను.* [4]

---

3. కుయిల్ పాట్టు : కుయిలుం కురంగుం – పాదాలు. (57–58)
4. పై. దే. కుయిలుం– మాడుం. పాదాలు. (71–75)

అంటూ తన హృదయాన్ని ధారపోసుకున్న తీరును వివరించారు. మధురమైన సంగీతం కారణంగా పరవశం చెందిన దశలో వరిపంట కంకులన్నింటినీ చూపించి ఆనందించారు. పంచభూతాలు ఆకాశంలో గుండ్రటి ఆకారాలను దాల్చి తిరుగుతున్నట్లు బ్రహ్మాండాది కోట్లు, రోజూ పుడుతూ మరణించే అనంతకోటి జీవరాశులు మొదలైనవాటి సృష్టిని తలచుకొని ఆశ్చర్యం చెందారు. వీటన్నింటికన్నా సంగీతమే ఉన్నతమైంది అనేది,

*అయినప్పటికీ ఉన్నాయి అద్భుతాలు అన్నిట్లోనూ*
*కనిపించే మధురమైన దృశ్యాలు ఎన్నెన్నో వింతలు!*
*చూపులకందని ఆకాశం, సముద్రం అంతా వింత అయితే*
*సంగీతాన్ని పోలిన ఆశ్చరం ప్రపంచంలో లేదురా!*
*భూతాలు అందించే కొత్తలు వింత అయితే*
*నాదాలు సంగమించే నేర్పుకు సరి అవుతుందా?*
*కోరికలు కలిగించే కోటి అద్భుతాలు చూసినపుడు*
*శబ్దమిచ్చే ఆనందం సాటిలేని ఆనందం కదా?*[5]

అనే గేయ పంక్తుల్లో వివరించారు. ఎన్నోరకాలైన మధురమైన శబ్దాలను కవి కోయిల ద్వారా పట్టికవేసి చూపించడం వల్ల కవి స్వయంగా వాటికి ఆకర్షితులయ్యారు అని చెప్పడానికి దృష్టాంతంగా అవి రూపొంది ఉన్నాయి. ఈ పట్టికే కోయిలపాటకు ఒక విధమైన అందాలను చేకూరుస్తూ ఉంది.

సంగీతం యొక్క ఔన్నత్యాన్ని సంగకాల కవులు తమ రచనల్లో

5. పై. దే. పాదాలు. (93–100)

చాలాచోట్ల ప్రస్తావించారు. కురింజి ప్రాంతానికి చెందిన నాయిక బండచాటున కురింజి రాగంలో పాడుతున్న పాటను విని తినైపొలంలో మేస్తున్న ఒక ఏనుగు తన నోటిలో ఉన్న తినై కంకులను తినకుండా, నిలుచున్న చోటునుండి కదలకుండా నిద్రపోయింది అనే విషయాన్ని అగనానూరు కవి వర్ణించాడు.[6] మధురమైన సంగీతాన్ని విని అందులో పూర్తిగా లీనమైపోయిన "అచుణమా" అనే జంతువు గురించి నట్రిణై పేర్కొంది.[7] కలిత్తొగైలో కూడ ఒక మదపుటేనుగు యా**ళి** వాయిద్య సంగీతానికి మైమరచి నిలబడిపోయినట్లు పేర్కొంది.[8] తినై పంటపొలాన్ని కాపలాకాస్తున్న నాయిక గొంతు చిలుక గొంతులాగ మధురంగా ఉండడం వల్ల కంకులపై వాలి గింజలు తింటున్న చిలుకలు ఎంత శబ్దం చేసినా అక్కడినుండి కదలడం లేదు, అవి సంగీతానికి మైమరచాయి అని కణిమేదావియర్ అనే పండితుడు వర్ణించాడు.[9]

సంగీతం యొక్క ప్రాధాన్యతను శిలప్పదికారంలో కూడ చూడవచ్చు. సెంగుట్టువన్ మహారాజు కణ్ణగి విగ్రహం ప్రతిష్టించడానికై శిల తీసుకురావాలని హిమాలయం వెళ్లి తిరిగిరావడానికి ముప్పైరెండు నెలల సమయం పట్టింది. అతని ఎడబాటు సహించలేక వేదనా సముద్రంలో మునిగి ఉన్న కోప్పెరుందేవి తన భర్త వచ్చే మార్గంవైపుగా తన దృష్టిని కేంద్రీకరించి కాచుకోనుంది. సెంగుట్టువన్ వచ్చే రోజు ప్రకటింపబడింది. దానికి మొదటిరోజు రాత్రి కోప్పెరుందేవి కురింజి, ముల్లై, మరుదం,

---

6. అగనానూరు – 102
7. నట్రిణై – 304
8. కలిత్తొగై – 2
9. తిణైమాలై నూట్రైంబదు – 2

నెయ్దల్ అనబడే నాలుగు విధాలైన భూప్రాంతాలకు చెందిన రాగాలతో కూడిన సంగీతం వింటూ నిద్రపోకుండా ఉన్నదని వర్ణిస్తాడు ఇళంగోవడిగల్. కురత్తి ప్రజలు పాడిన కురింజి రాగము, కర్షకుల పాటలు, గోపాలురు ఊదే పిల్లనగ్రోవి సంగీతము, పొన్నచెట్టు కింద కూర్చున్న ముసలి స్త్రీలు పాడుతున్న చావుపాటలు మొదలైన వాటి గురించి కవి అద్భుతంగా వర్ణించాడు.[10] దీనివల్ల సంగీతంయొక్క ప్రాధాన్యత తెలుసుకో గలుగుతున్నాము. మాయావృద్ధ బ్రాహ్మణవేషంలో వచ్చిన జీవకుడు "ఏ మనిషినీ కన్నెత్తి చూడను" అని శపథం చేసిన సురమంజరిని సంగీతంతో గెలిచిన వార్తను జీవక చింతామణి పేర్కొంటూ ఉంది.[11]

ముగ్గురిచే రచింపబడిన తేవారం పాటలు, ఛందోబద్ధమైన రాగాలచే రూపొందింపబడ్డాయి. జ్ఞానసంబంధర్ "వేట్కళ్ మేల్ మొ**ళి**ంద పణ్ణియల్[12] అనే గేయం దేవారం సంగీతం తమిళంతో ముడిపడిందని చెప్పబడింది. అప్పర్ మహాశయుని తిరుత్తాండకంలోని ఒక గేయాన్ని సంగీతంతో మేళవించి రాగయుక్తంగా పాడితే దానివల్ల కలిగే ఆనందం చెప్పడానికి వీలుకాదని చెబుతుంది. (మున్నం అవనుడైయ నామం కేట్టేన్) (తేవారం 6.25:17) మొదట అతని నామాన్ని విన్నాను. అప్పన్ నీ అమ్మై నీ"(తే. 6.95:1) అనే గేయాలను దరుమపుర ఆదీనం స్వామినాధన్ పాడగా విన్నట్లయితే ఈ నిజం తెలుస్తుంది. అరవైమూడు మంది నాయన్మారులలో ఒకరైన యాదవ కులానికి చెందిన అనాయర్ పిల్లనగ్రోవి వాయించి పరమేశ్వరుని పాదసన్నిధి చేరుకోగలిగాడు అని తిరుత్తొండర్ పురాణం

---

10. శిలప్పదిగారం. 3-27; (217-250)

11. జీవక చింతామణి. 209

12. తేవారం. 1.9:11

చెబుతోంది. అతని పిల్లనగ్రోవి సంగీతాన్ని వింటే "స్థిరములు, చంచలములు" ఏమవుతాయనేది చేక్కిళార్ మాటల్లో విని అనుభవించాలి.[13] తిరునీలకంఠ యాళ్ప్పాణర్ పాణబద్దిర, తిరుప్పాణాళ్వార్ మొదలైన భక్తులు సంగీతంద్వారా దేవదేవుని ప్రస్తుతించి మోక్షపదవినందుకొన్న పుణ్యమూర్తులు అనేది చరిత్ర చెబుతోంది.

అళ్వారుల పాశురాలు కూడ సంగీతంతో ముడిపడినవే. ఉదాహరణకు "ముళైక్కదిరై" "మిన్ ఇలంగు" మొదలైన తిరునెడుందాండకం పాశురాలు సంగీతంతో పాడినట్లయితే తొలి పాపాలను మొదలంట నిర్మూలించవచ్చు. పాడేటప్పుడు హృదయం తల్లడిల్లుతుంది. సంతోషంతో రోమాంచితమై కళ్లల్లో నీళ్లు వర్షిస్తాయి." ఈ అనుభవం మనకు తెలియవస్తుంది. శ్రీకృష్ణుని చిన్నివేళ్లను తడిమి (పెరియాళ్వార్ తిరుమొ**ళి** 3.6) మొదలైన సంఘటనలను పెరియాళ్వార్ భాషలో విని ఆనందించాలి.[14] తిరువాయ్ మొ**ళి**ని 'సామవేద సారం' అని చెప్పడం వైష్ణవ సంప్రదాయం. సంగీత తమిళ విభాగానికి చెందింది. "పణ్ఆర్ తమిళ్" (తిరువాయ్ – 9.8.11) సెయిర్ఇల్ సొల్ ఇసైమాలై (తిరువాయ్ 3-2-11) పణ్ ఆర్ పాడల్ ఇన్ కవిగళ్ (తిరువాయ్. 10-7-5) మొదలైన పదబంధాలు దీనికి దృష్టాంతాలుగా ఉన్నాయి. శఠగోపుల పద వైవిధ్యాలను, ఛందోరీతులను వేయింటిని సంగీతంతో చెవులారా ఆలకించాలి.

భగవంతునిలో ఐక్యం కావడానికి, ముక్తిమార్గంగా దారి చూపడానికి తోడ్పడేది సంగీతం. శ్రీకృష్ణుని(పరమాత్మ) పిల్లనగ్రోవి సంగీతం

---

13. పెరియ పురాణం : అనాయర్ పురాణం. 30-35

14. పెరియాళ్వార్ తిరుమొళి. 3-6

యాదవ వనితల (జీవాత్మల) హృదయాలను పరవశింపజేశాయని భక్తికావ్యాలు చెబుతున్నాయి. పాణర్ మహాశయుని యాళ్ వాయిద్య సంగీతము, అనాయరుని వేణుగాననాదము ఆ మహాభక్తులకు ముక్తికి మార్గంగా దారి చూపింది. అని మొదట చెప్పుకున్నాము. తుంబురుడు, నారదుడు ఇరువురూ వీణద్వారా భగవంతుని ప్రస్తుతించిన మునిపుంగవులనేది మనకు తెలుసు. వీణావాదనలో నిపుణుడైన రావణుడు వీణను తన రథకేతనంగా కలిగినవాడు అనేది మనకు తెలుసు. అరుణగిరియార్ యొక్క సంగీత తమిళమైన తిరుప్పుగళ్ వారికి మోక్షాన్ని ప్రసాదించింది. త్యాగరాజు సంగీతగేయాలే వారికి మోక్షాన్ని అనుగ్రహించాయని మనందరికీ తెలుసు.

పైన పేర్కొన్న సంప్రదాయాలన్నీ భారతియారుకు క్షుణ్ణంగా తెలుసు. "తాను కూడ సంగీతకళలో నిష్ణాతుడు, "గాన సామర్థ్యంచే ఈ ప్రపంచాన్ని పాలించాలి"[15] అనే మహదాసక్తి కలిగినవారు. దీని కారణంగానే వినాయకుని

***"వందనాలు! పార్వతీపుత్రా! సంగీతంలో***
***నిష్ణాతుని గావించి ఈ భక్తుని ప్రేమతో***
***వాణి పాదాలను ఆశ్రయింపజేసి రక్షించవా!***
***వాణి కరుణతో వీణానాదాలు నా నాలుకలో మెదలాలి"***[16]

అని ప్రార్థించాడు. ఒకచోట వాయుదేవుని

***"భూలోకంలో మంచిధ్వనులను గాలి***

15. తొ. పా. కాణి నిలం. 3

16. పై. దే. వి. నా. మా. 29

*అనే దేవుడు తీసుకువచ్చాడు*
*రాగాలతో కూర్చిన పలురకాల శబ్దాలను*
*గానంచేసి ఆనందించుదాం"*[17]

అని చూపించి వాటిని సంగీతంలో కూర్చి అనుభవించాలని చెప్పారు.

*"అందమైన పాటకు తాళం*
*మిక్కిలి చక్కగా కలగలసి ఉండాలి*
*పెక్కురాగాలలో అంతులేని ఆనందం*
*నేను పాడి నిష్ణాతుడు కావాలి"*[18]

అని సంగీత తమిళం తనకు యోగసిద్ధిగా ప్రసాదించాలని ప్రార్థించారు. ఈవిధంగా సంగీతంలో ప్రేమాభిమానాలను కలిగిన భారతియార్ 'పాడే' శక్తి కూడ కలిగినవారు. సంగీతంలోని సూక్ష్మభేదాలను నాడిచూసి కనిపెట్టగల సంగీత భిషగ్వరేణ్యులు. అందువల్లనే

*"కోరికలీనే కోట్లాది అద్భుతాలు చూసినపుడు*
*నాదం అందించే ఆనందం సాటిలేని ఆనందం కదా!"*[19]

అని చెప్పి సంగీతానికే మొదటిస్థానం ఇచ్చారని చెప్పవచ్చు.

---

17. తొ. పా. నిలావుం నాన్ మీనుం. కాట్రు – 5
18. తొ. పా. యోగసిద్ధి – 7
19. కుయిల్ పాట్టు : కుయిలుం మాదుం, పాదాలు (99–100)

# అధ్యాయం - 7

# కవితలోని అంతరార్థం

కోయిలపాటలోని కథను భారతియార్ "పట్టపగలు కనిపించే స్వప్నం"గా చెప్పినప్పటికీ కోయిలపాటను చదివిన ప్రతి ఒక్కరూ నిజానికి "ఈ గేయం కల్పనా కావ్యమా? లేక దానిలో అంతరార్థం ఏదైనా ఉందా?" అని ప్రశ్నలు వేసుకొని తలబద్దలు కొట్టుకుంటూ ఉంటారు. 'గేయం' నిర్మాణం, గేయంలోని కథాపాత్రల సంభాషణలు ఈ ప్రశ్నలను లేవనెత్తుతున్నాయి అని భావించకండి. గేయాన్ని పూర్తి చేసిన కవిగారే దీనిని చెబుతున్నారు. మానవుడు, పక్షి, జంతువులు వీటిని కథాపాత్రలుగా కలిగిన నాలుగురోజుల ప్రేమ నాటకాన్ని సువిస్తారంగా వివరించారు. కాని దాని తరువాత గేయాన్ని ముగించే ముందు

*"ఉద్యానవనంలోని కోయిల చెప్పిన ప్రేమకథ అంతా*
*సంధ్యాసమయ అందాల మైకం కారణంగా*
*హృదయంలో ఉదయించిన కల్పన - అని తెలుసుకున్నాను"*

అంటూ తనకు స్వీయస్మృతి వచ్చినట్లు చెప్పి కథను ముగించాడు. ఈవిధంగా పూర్వస్మృతి రావడం వారికి నచ్చలేదు. తాను చూసింది దాని అందమైన కవితలో దాగినవన్నీ వట్టి కల్పన. అది మాయారూపం అంటూ దాన్ని తోసివేయడానికి వారి మనసు ఒప్పుకోలేదు. దానికి ఒక అంతరార్థం ఉండాలని సూక్ష్మంగా తెలియజేస్తున్నారు.

*"గొప్ప తమిళ పండితులే అయినప్పటికీ*
*వేదాంతంగా సవిస్తారంగా వివరించడానికి*

*ఏదైనా ఒక అవకాశం ఉంటే చెబుతారా?"*

అంటున్నారు. గేయాన్ని ఒక చిక్కు ప్రశ్నవేసి ముగించినట్లు అనిపిస్తోంది. కల్పనా కావ్యానికి వేదాంతార్థం ఉండాలని అన్వేషిస్తున్నారు కవి. ఈ "వేదాంతార్థం" అంతరార్థంగానూ ఉండవచ్చు. ఆధ్యాత్మిక అర్థంగానూ ఉండవచ్చు. వీటిని లోతుగా ఆలోచిద్దాం.

మనదేశంలోని పండితులు ఏవిధమైన కథ అయినప్పటికీ అందులో కవి ఆలోచించి చూడని అంతరార్థాన్ని, వేదాంత అర్థాలను తమ మనోభావాలకు తగినట్లు కల్పించి కథలోని స్వారస్యాన్ని మరిచి శాస్త్రతత్వాలలో మునిగి అల్లాడుతుంటారని కొంతమంది అభిప్రాయం. ఆచార్య కె. స్వామినాథన్ "గేయమనేది తన సొంతబలంతో నిలబడాలి. మతం, న్యాయపద్ధతి లేక దేశభక్తి అనే కర్ర ఊతగా నిలబడకూడదు. ఈ విధమైన స్వీయబలాన్ని కలిగినది 'కోయిలపాట'. స్వీకరించిన విషయం నూతనంగా ఉండడం వల్లనే ఈ ఫలితం సిద్ధించింది[1] అని అంటారు. దీనివల్ల "మతానికి సంబంధించిన అంశం" కోయిల పాటలో లేదని గట్టిగా చెప్పలేకపోయినప్పటికీ ఇటువంటి భావాలు అందులో ఉండవచ్చు అని అనుకోవడానికి అవకాశం ఏర్పడుతున్నది. కాని ఈ అంశాన్ని మరింత సూక్ష్మంగా పరిశీలించ వలసిన అవసరం ఉంది.

కావ్య మాధుర్యం తక్కువగా ఉన్న మతగ్రంథాలను పరిశీలిస్తే, మహాకవి తన భావావేశాలతోనూ, సరస్వతిదేవి అనుగ్రహంతోనూ తన రచనలో పద మాధుర్యము, అర్థ మాధుర్యము ఉన్నతంగా ఉండేలాగ రచించడానికి వీలవుతుంది అని చెప్పడానికి మన దేశానికి చెందిన కావ్యాలలోనూ, పాశ్చాత్యదేశానికి చెందిన కావ్యాలలోనూ పెక్కు దృష్టాంతాలు

1. బారతియారిన్ 'కుయిల్' కలైమగళ్–1935. సంవత్సరం ఉత్తరార్థంలో వెలువడిన వ్యాసం.

ఉన్నాయి. కాని 'కోయిల పాట'లో బయటకు కనిపిస్తున్న ఇతివృత్తం నదీ ప్రవాహం లాగ ఎలాంటి అడ్డంకులూ లేక సాగే పదమాధుర్యమే ఉన్నతంగా విలువగట్టదగిన అంశాలవుతాయి. ఒకవేళ వేరొక అంతరార్థం అందులో ఇమిడిఉంటే దానిని తెలుసుకోలేక కవితలోని అందాలను సద్గుణాలను అనుభవించడానికి వీలవుతుందనే నిజాన్ని నిరాకరించడానికి వీలుకాదు. అయినప్పటికీ కవి పదిలపరిచి ఉన్న అంతరార్థాన్ని మనం తెలుసుకున్నప్పుడే కావ్యంలోని మాధుర్యాన్ని సంపూర్ణంగా అనుభవించగలిగిన వాళ్లమవుతాము. సంగసాహిత్యంలోని గేయాలలోని వస్తువు అంతరార్థము మన హృదయంలోనికి చక్కగా అవగతమైనపుడు మనం పొందే కవితానుభవం ఒక ప్రత్యేకమైనదని మనకు తెలిసివస్తుంది కదా! ఈ విధంగా అంతరార్థాన్ని బహిరంగంగా వ్యక్తం కాని రీతిలో రసభరితంగా కవి ఏవిధంగా సంఘటనలను కల్పిస్తూ రచన సాగించాడు అని పరిశీలించడంలో నిజంగానే హృదయం ఆనందపరవశం చెందుతుంది.

భారతియార్ తన 'కోయిల పాట' అనే కల్పనా కథాకావ్యానికి వేదాంతార్థం ఇచ్చారనేది గేయంలోని చివరి మూడు చరణాలు తెలియజేస్తున్నాయి. వేదాంతార్థమనేది రెండు విధాలుగా చెప్పుకోవచ్చు. సాధారణంగా అంతరార్థం అంటే (లేక లోపలి ఇతివృత్తం) వస్తువు అని చెప్పుకోవచ్చు. లేక ఆధ్యాత్మిక సంబంధమైన వస్తువు అని చెప్పవచ్చు. భారతంలో ఉన్న ఒక కథను ప్రస్తుతం గుర్తుకు తెచ్చుకుందాం.

ఒక అడవిలో పులిచేత తరమబడిన ఒకడు ఒక పాడుబడిన బావిలో పడిపోయాడు. కింద విషపూరితమైన నాగుబాము పడగఎత్తి నిలబడి ఉంది. బావిలో వేలాడుతున్న మర్రిచెట్టు ఊడలను పట్టుకొని ఆ వ్యక్తి

వేలాడుతున్నాడు. మర్రిచెట్టు ఊడలను తెల్లని నల్లని ఎలుకలు కొరుకుతున్నాయి. ఈ అపాయకరమైన పరిస్థితిలో పైనుండి కారుతున్న తేనెబొట్టుకు నాలుక చాస్తున్నాడు ఆ వ్యక్తి. ఇది ప్రాపంచిక జీవితాన్ని అంతరార్థంగా కలిగిన కథ. అన్నీ సాంకేతికమైనవే. అడవి ఈ ప్రపంచం, తరుముతున్నది ఆశ, పడినది ప్రమాదంలో, పట్టుకోనున్నది ప్రాణాలు. దానిని కోస్తున్నది రాత్రింబగళ్లు. ఈ పరిస్థితుల్లోనూ తేనెబొట్టుకు నాలుక చాచడం ఇలాంటిది జీవితంలోని మాధుర్యం అనేది కథలోని అంతరార్థం.

రామాయణంలోని అంతరార్థాన్ని ఒక పర్యాయం గుర్తుకు తెచ్చుకుందాం. అయోధ్య రాజకుమారుడు భార్యను పోగొట్టుకొని వానరుల సహాయంతో రాక్షసులను సంహరించి సీతాదేవిని తిరిగి పొందినట్లు కథ. శ్రీరాముడు పరమాత్మ. సీత జీవాత్మ. చెరబట్టినవి పది ఇంద్రియాలు. జీవాత్మకు ధైర్యం చెప్పినవారు గురు. నిర్మలమైన భక్తిచేత జీవాత్మ ఇంద్రియాలనే చెరశాలనుండి విడిపించబడి పరమాత్మలో లీనమవుతున్నది. ఇది రామాయణంలోని ఆధ్యాత్మిక అర్థం. ఇక్కడ కూడ సంకేతాలు పాల్గొంటున్నాయి. ఈవిధంగా కోయిలపాటకు కూడా ఆధ్యాత్మికమైన అర్థమో వేదాంతార్థమో ఉందా? అనే ప్రశ్న కలుగుతోంది. కవి 'ఉంది' అని అంటున్నారు. అది ఏమి అనేది వారు ఎందుకు చెప్పలేదు. ఈ ప్రశ్న మళ్లీ కలుగుతోంది.

దీనికి రెండు కారణాలున్నట్లు మనకు తోస్తున్నది. కల్పనలో అంతరార్థం ఉన్నది అని మాత్రం తెలిపి ఉండవచ్చు. లేక అంతరార్థం బహిర్గతం చేయడానికి కవి సిగ్గుపడి ఉండవచ్చు. ప్రేమకవితలో కవియే కథానాయకుడు. తన ప్రేమనాటకాన్ని బహిరంగంగా చెప్పడంలో ఎవరికైనా

సంకోచం ఉండడం సహజం. ప్రేమనాటకంలో అంతరార్థం వేరొకటి ఉంది అంటే అది అధికమైన సంకోచానికి ప్రారంభమవుతుంది. ఈ రెండు కారణాలలో ఏ కారణంవల్ల కవి తన కవితలో అంతరార్థ వస్తువును వివరించలేదు అనేది ఒక చిక్కుముడిగానే ఉంది.

## ఊహించి చెప్పే అంతరార్థం :

1. మొదట కావ్యంలోని సంఘటనలను గుర్తుకు తెచ్చుకుందాం. ప్రాత:కాలంలో మామిడిచెట్టులోని కోయిల గానం చేస్తున్నది. కవి పాటవిని తన్మయులయ్యారు. కోయిల పాడుతున్నది ప్రేమగీతం. పాట ముగిసిన తరువాత కవి, కోయిల మధ్య ప్రేమకు సంబంధించిన మాటలు సాగుతాయి. నాలుగోరోజు కలుసుకుంటానని చెప్పి కోయిల వెళ్లిపోతుంది. మరురోజు అదే తోట; అదే కోయిల. ఇప్పుడు కోయిల కురంగన్‌తో ప్రేమనాటకం ఆడుతున్నది. కవి హృదయంలో కోపం దహించుకుపోసాగింది. మూడోరోజు అదే తోట; అదే కోయిల. అదే దొంగనాటకాన్ని ఈ పర్యాయం ఒక ముసలి ఎద్దుతో సాగిస్తుంది కోయిల. నాలుగోరోజు విజ్ఞర్ కోయిల కలయిక. కవిగారి కోపం. కోయిల శాంతివాక్యాలు పలుకుతుంది. తరువాత కవి దగ్గర శరణం ఆశ్రయిస్తుంది. కోయిల రూపం మార్చుకోవడం. మాయ యొక్క పతనం. ఆనందంలో లీనం కావడం.

ఈ సన్నివేశాలను తాత్త్వికంగా పోల్చి పరిశీలిద్దాం. వేదాంతపరంగా కోయిల, మాడన్, కురంగన్ – నాయగన్ – వీళ్లు ఎవరు? ఇక్కడ కోయిల చేతనుడు లేక జీవుడు. జీవుడు 'తాను' అనే అహంకారం కారణంగానూ, 'తనది' అనే మమత కారణంగానూ పరమాత్మకు తనకు

కలగబోయే నిజమైన ఆనందాన్ని విస్మరిస్తుంది. జీవుడు పరమ వస్తువైన లేక పరమాత్ముని చేరే ప్రయత్నాన్నే సంచలనం అని మహామునులు పేర్కొన్నారు. జీవాత్మకు పరమాత్మ మీదున్నది కట్టుబరచడానికి వీలుకాని కవితా ప్రేమ. లక్ష్యప్రేమ. జీవాత్మను పరమాత్మతో ఐక్యం చేయడమే ఆ ప్రేమకు విజయం. కావ్యంలో కోయిల ప్రేమ మనసులోని కోరికలు, అనగా నాయకుని పొందాలనే తీవ్రమైన వాంఛను సూచిస్తున్నది. ఎడబాటు దు:ఖాన్ని, సంగమ సుఖాన్ని తెలియజేస్తున్నాయి. కోయిల కవిని అన్వేషిస్తూ దు:ఖాన్ని, అతనితో కలసి ఆనందాన్ని పొందినట్లు, జీవాత్మ పరమాత్మను అన్వేషిస్తూ దు:ఖాన్ని, పరమాత్మతో కలసి ఆనందాన్ని పొందుతున్నది అని వివరించవచ్చు.

కోయిల – జీవాత్మ; కవి–పరమాత్మ అనే సంకేతాలు సరియైనవే. కాని కథలో వచ్చే కోతి, పశువు ఎవరిని సూచిస్తున్నాయి. కోయిల వీళ్లతో ప్రేమనాటకం నడిపింది ఎందుకు? వీటిని వివరించడానికి 'కైవల్యం' అనే తాత్త్వికగ్రంథం మనకు ఉపయోగపడుతున్నది. వేదాంతంలో మనసును పరిభ్రమింపజేసే శక్తులు రెండుగా పేర్కొనబడుతున్నాయి. ఒకటి ఆవరణ శక్తి. మరొకటి విక్షేపశక్తి. పదార్థం యొక్క వాస్తవమైన రూపాన్ని దాచడం ఆవరణశక్తి. మనస్సు దీనికి వశమై ధైర్యం ఇదీ అని తెలియక వాస్తవాన్ని మరిచి విస్మృతి చెందుతుంది. ఈ శక్తి మనస్సును అడ్డగించి పదార్థాన్ని అందుకోనీక అల్లాడేటట్లు చేస్తుంది. పరమపదార్థాన్ని మరిచిపోవడాన్ని 'పశువు' అని పిలవడం కొత్తేమీ కాదు. "మార్గాన్ని మరుగుపరిచి ఉంది కొండను పోలిన ఒక పశువు" అని నందనార్ రచించిన విషయం మనకు తెలుసు. 'పశు' (మాడు) అనేది ఆవరణ శక్తి. కథలో మాడన్ అడ్డుగా

వచ్చి కోయిలను సమ్మోహితను చేస్తాడు. మాయలో చిక్కుకున్న కోయిల మాడన్‌తో ప్రేమను సాగిస్తుంది. ఇది అయోమయమైన పిచ్చిచేష్ట అవుతుంది.

మళ్లీ మళ్లీ ప్రత్యక్షమయ్యేది విక్షేపశక్తి అవుతుంది. ఇది ఒక విధమైన మంత్రజాల విద్యను పోలింది. క్షణక్షణానికి ఇందులో మార్పులు కనిపిస్తాయి. ప్రదేశానికి మరొక ప్రదేశానికి భేదం కనిపించడంలో కూడ ఒక వేగం కనిపిస్తుంది. వేగంలోనూ, విభేధాల్లోనూ కుహనా సంతోషం కనిపిస్తుంది. విక్షేపశక్తి వల్ల నియంత్రింపబడిన మనస్సును కోతితో ఉపమించారు తత్వ విజ్ఞానులు. అలుపులేని చేష్టలతో కురంగన్ అడ్డుగా వచ్చి కోయిలను నిరోధిస్తాడు. కోయిల కురంగన్‌తో దొంగప్రేమ నాటకం ప్రదర్శించడం విక్షేపశక్తి విజయమవుతుంది.

శరణాగతి ద్వారా పరమ పురుషునితో ఐక్యం కావడంగా చూపించడం, కోయిల కవి చేతుల్లో వాలడం ఇది నిజమైన విజయాన్ని సాధించడం సూచిస్తోంది. ఆవరణ విక్షేపశక్తుల తాండవమే జన్మాదిగా కొనసాగుతూ వచ్చే బంధం. ఈ రెండు శక్తుల చర్లాటలు నశించిపోతే ఎల్లలులేని మహదానందాన్ని కలిగిస్తుంది. కోయిలపాటలో ఒక పర్యాయం కురంగన్ మీద మరొక పర్యాయం 'మాడన్' మీద తన కరవాలాన్ని వీచడం అవాస్తవమైన మాయను ఛేదించడాన్ని సూచిస్తుంది. ఖడ్గము, వేలాయుధము జ్ఞానానికి సంకేతాలు. "జ్ఞానజ్యోతి నిశితఖడ్గము" (కందరలంకారం - 25) వళిక్కుత్తుణై వడివేల్ - అనే భాగాలను చూడండి.

2. ఈ గేయంలోని తత్త్వాన్ని వేరొక విధంగా కూడ

ఆలోచించవచ్చు. సాధారణమైన పక్షి ఒకటి ఒక పశువుతోనూ ఒక కోతితోనూ ప్రేమను కొనసాగించడానికి సాధ్యం కాదు అనేది ఆలోచించదగింది. తరువాత మాడన్, కురంగన్ ఇరువురూ దయ్యాలై తమ ఆకారాలను కోయిల మరిచిపోయేలా చేస్తారు. ఆ తరువాత కోయిల దక్షిణ పొదిగైపర్వత మునివరేణ్యుల దగ్గర మాట్లాడి తన పూర్వజన్మను తెలుసుకొన్న తరువాత – జ్ఞానోదయం అయిన తరువాత – ఒక స్త్రీ రూపం ధరించి పురుషుడనే ఆత్మతో తన నిజమైన ప్రేమను చెప్పి ఇరువురి మనసులు కలసి ఆనందించడం ఆలోచించదగ్గది. కోయిల అనేది జీవాత్మను సూచించే ఒక సంకేతం. చిన్నారి కోయిల 'తాను' అనే అహంకారం కారణంగానూ, 'తనది' అనే మమత కారణంగానూ పురుషుడనే ఆత్మదగ్గర తనకు లభించగల నిజమైన ఆనందాన్ని మరిచిపోతుంది. తన మామ కొడుకైన 'మాడన్' దగ్గర, తాను అనే అహంకారంతో విర్రవీగే 'కురంగన్' దగ్గర కుహనాప్రేమను చూపిస్తుంది. దీని కారణంగా తరువాతి జన్మలో తన స్వరూపాన్ని మరిచి జడంగామారి ప్రాచీన ప్రకృతి పరిణామమైన శరీరం మీద ప్రేమ చూపిస్తుంది. ఆ మైకం వీడిన వెంటనే శరీరంకంటే కొంత ఉన్నతమైన మనసుమీద అభిమానం చూపిస్తుంది. మనసు ఎప్పుడూ స్థిరంగా అణగి ఉండక అటూ ఇటూ సంచరిస్తూ పరిగెత్తుతూ గంతులు వేస్తూ వస్తుంటుంది. మనసును, ఇంద్రియాలను కోతికి ఉపమించి చెప్పడం మన పెద్దల సంప్రదాయంగా ఉండడం మనం చూస్తూ వస్తున్నాము. తరువాత కోయిల పరమగురువు ఉపదేశం పొంది రెండురకాల అపస్మృతుల నుండి బయట పడుతుంది. పురుషుడనే ఆత్మ ఉన్నట్లు తెలుసుకుంటుంది. ఆ ఆత్మమీద నిజమైన ప్రేమను ఉంచి తన నిజస్వరూపాన్ని పొంది ఆత్మతో మమేకమై పరమానందం పొందుతుంది. ఈ అంతరార్థ అంశాన్ని భారతియార్ తన

కోయిలపాటలో ఇమిడ్చి పెట్టారు అని భావించవచ్చు.

3. ఇంకొకవిధంగా కూడ ఆలోచించడానికి 'కోయిల పాట' అవకాశమిస్తున్నది. కోయిల పూర్వజన్మలో చేరదేశంలో వీరమురుగన్ అనే వేటగాడి కూతురిగా జన్మించింది. మురుగన్ అందానికి, వీరోత్సాహాలకు సంకేతం. అందువల్ల కోయిల ఒక అందమైన స్త్రీగా జన్మించింది. ప్రేమ, అందము, భగవంతుని పొందడానికి మార్గాలు అని పెద్దలు చెప్పియున్నారు. కోయిలపాటలో భారతియార్ ఇలాంటి మార్గాన్ని నిర్దేశించి ఉన్నారని భావించవచ్చు. భారతిగారు నిశితంగా ఆలోచించే మురుగన్ అనే పేరును ఎంపిక చేశారా? లేదా అనేది ఊహించి తెలుసుకోదగినదే అయినప్పటికీ 'మురుగన్' అనే పదం పలువిధాలుగా మనల్ని ఆలోచింపజేయడానికి తావిస్తోంది. చేరదేశపు అమ్మాయిని ఎంపికచేసిన దత్తన్ కారణం బహిరంగమైంది. సాధారణంగా చేరదేశపు స్త్రీలు అందంలో ప్రసిద్ధి చెందినవాళ్లు అనేది అందరికీ తెలిసిన నిజం.

*"సింధునదీ జలాలలో వెన్నెలలో*
*చేరదేశపు అందమైన అతివలతో*
*సుందరమైన తెలుగులో గీతాలను ఆలపిస్తూ*
*పడవలను నడుపుకుంటూ విహరించుదాం"* [2]

అనే పాటలో చేరదేశపు యువతులు అందంకోసమే పేర్కొనబడడం చూడవచ్చు. ఈ దేశపు స్త్రీలు తమ దేశానికి చెందనిదైన అద్భుతమైన స్త్రీని దేవతగా ఉన్నతంగా సముత్కర్షింపజేసి పూజించిన విషయం శిలప్పదిగారం అంతరార్థంగా విరాజిల్లుతుండడం భారతియార్‌కు

2. దేశీయగీతం. భారతదేశం – 5

క్షుణ్ణంగా తెలుసు. పుహార్ నగరం పరిమితికి మించిన అందమైన సుఖభోగాలచే నశించిపోవడమూ, దుర్విధికారణంగా మదురై మహానగరం విచారకరమైన పరిస్థితుల్లో ధర్మమార్గం నుండి వైదొలగిపోవడమూ, చేరదేశము వీర స్త్రీరత్నమైన కణ్ణగిని పూజించడం కారణంగా ప్రసిద్ధిని, మంచిపేరును సంపాదించిన విషయమూ భారతిగారికి చక్కగా తెలుసు. చేరదేశపు యువతుల అందము, సద్గుణాలు, వీరం ఇవన్నీ ఒకచోట కూడుకొని ఉండడం చూశారు. కోయిల చేర రాజకుమారుని పెళ్లి చేసుకుంటుంది; ఈ ఇద్దరి పెళ్లి అంతులేని కాలంవరకు ఆత్మ, పరమాత్మ రెండూ సంగమించిన దశగా మనం భావించాలి.

4. ఉపనిషత్తుల్లోని ఒక అంశం కోయిలపాటతో అనుసంధానించి మనల్ని చూసేలా చేస్తున్నది. ఒకే రంగుతో కూడుకొన్న రెండుపక్షులు ఒక చెట్టుకొమ్మ మీద కూర్చొనున్న దృశ్యాన్ని ఉపనిషత్తు మనకు చూపిస్తున్నది. వాటిలో ఒక పక్షి ఆ చెట్టులోని పండును తింటూ తన్ను తాను మరిచిపోయింది. మరొకటి ఓపిగ్గా ఆ పక్షి తింటున్నది చూస్తూ ఆనందిస్తున్నది. పండును తింటున్న పక్షి మనయొక్క ఆత్మను, దానిని చూస్తున్న పక్షి పరమాత్మను ఉపనిషత్తు ఒక ప్రతీకగా పేర్కొన్నట్లు తత్త్వవేత్తల అభిప్రాయం. పండును తింటున్న పక్షి భగవంతుని చూడగానే, అది ప్రాపంచిక ఆనందాలన్నింటినీ వదలిపెట్టి పరమాత్మతో ఎన్నడూ విడదీయరాని అనుబంధాన్ని కోరుకుంటున్నది. కోయిలపాటలో మాడన్, కురంగన్ ఇరువురూ అస్థిరములైన ఆనందాలను సూచిస్తున్నది. కాని దానిని విజ్ఞానులు వాటిని నశింపజేయడానికి కారణమవుతున్నది. తరువాత అది ఇంద్రియాల బానిసత్వం నుండి విడిపించబడి అనంతమైన ఆనందాన్ని అందించే మోక్షాన్ని అందుకుంటుంది. కవిగారు కోయిల వెన్నంటి తిరగడం

అందుకోలేని వాటిని తెలుసుకోలేని వాటిని – చేరుకోవలసిన గమ్యం వైపుగా సాగే ప్రయాణాన్ని సూచిస్తున్నట్లుగా భావించవచ్చు. ఈ సుదీర్ఘప్రయాణం భారతియార్ హృదయంలో సందడించే ప్రయాణమవుతుంది. గేయం చివర కవి తన అక్షీణమైన ఆత్మను దర్శించి అందులో మునిగిపోవడం చూస్తున్నాము.

5. భారతియార్‌కు సంగీత కళను గురించి ఎంతో ఉన్నతాభిప్రాయం ఉంది. తాను స్వయంగా సంగీతకళలో నిష్ణాతుడు. సంగీతరంగంలో నైపుణ్యం సంపాదించి గొప్ప సంగీతవిద్వాంసుడు కావాలనేది వారి తీరని కోరిక.

*మాధుర్యాన్ని వర్ణించే పాటతో, తాళం*
*చక్కగా అనుసంధానమై ఉండాలి*
*పెక్కురాగాలలో ఆలపిస్తూ పారంగతుడనై*
*అనంతమైన ఆనందాలను అనుభవించాలి.* [3]

అనే గీతం వారి ఆకాంక్షను వ్యక్తంచేయడం చూడవచ్చు. సంగీత కళాకారుని గొంతు ఎంతో మధురంగా ఉండాలి. అతను సంగీతానికి సంబంధించిన మెలకువలన్నీ సూక్ష్మంగా గ్రహించిన గొప్ప సంగీతజ్ఞుడుగా ఉండాలి. కాని ఈ రంగం సూక్ష్మభేదాలు సంగీత పరమాధి అయిన సంగీత మాధుర్యంలోనిదిగా ఉండాలి. సంగీతానికి సంబంధించిన పెక్కు విధి విధానాలు, సూక్ష్మభేదాలు తలఎత్తు తున్నాయి. కొన్ని సమయాల్లో ఇవి సంగీతకళలోని ఆత్మనే తబ్బిబ్బు పడేలా చేస్తుంది. నిజమైన సంగీత

---

3. తొ. పా. యోగసిద్ధి–7

విద్వాంసుడు సంగీతానికి సంబంధించిన విధి విధానాలను, సూత్రాలను మరిచి వాటిని జయించగల ఉన్నతస్థానంలో ఉండి పాడాలి. కారణం, అన్నింటినీ మరిచిన దశలోనే సంపూర్ణత్వాన్ని పొందగలం. ఇవన్నీ సంగీతానికి సంబంధించి భారతిగారి ఉన్నతమైన అభిప్రాయాలు.

ముసలిపశువు ఆకాశంలోని పిడుగులాగా 'మా' అని ఉరమడమూ, అర్థం లేకుండా కిచ కిచమంటూ ఎడతెగకుండా కొరుక్కుంటూ కోయిలపాటకు తగినట్లు చిరాకు కలిగేవిధంగా గెంతడమూ, తాళాలు వేయడమూ – సంగీతం గురించిన ప్రాథమిక పరిచయం కూడాలేని ఒక సాధారణ గాయకుడిని గుర్తుకు తెస్తున్నది. ఇతను శారీరక చేష్టలను ముఖం చిట్లింపులను సంగీతమని తప్పుగా భావిస్తాడు. కోయిల అన్ని విధాలుగానూ సంపూర్ణమైన, దోషాలు ఏవీ లేని సంగీత విద్వాంసుని గుర్తుకు తెస్తున్నది. ఈ విధంగా 'కోయిల పాట' అతని కాలానికే – ఎందుకు? ఈ కాలానికి చెందిన సంగీత విద్వాంసులను కూడ వ్యంగ్యార్థ సంకేతభావంతో రూపొందింపబడినట్లు భావించవచ్చు.

ఈ విధంగా 'కోయిల పాట'కు సారంలేని అర్థాలు చెప్పుకోవచ్చు. గేయాన్ని చదివేవారి ప్రాథమిక జ్ఞానానికి, వివిధ రంగాల్లో వారికున్న పరిజ్ఞానానికి తగిన అర్థాలు వారికి తోచవచ్చు. కాని భారతియార్ ఇలాంటి అర్థాలనా కోయిలపాటలో ఇమిడ్చారు? అనే ప్రశ్నను లేవనెత్తితే "అవును" అని చెప్పడానికి ఎవరికీ ధైర్యం చాలదు. "ఉంటే అలా ఉండొచ్చు" అనే జారిపోయే సమాధానంగా తీసుకోవడానికి వీలుకాదు. భారతియార్ రచించిన పలు వేదాంతగేయాలలో ఏ ఒక్క గేయంలోనైనా జీవాత్మ కుహనా సంబంధం కలిగిన ఆవరణ. విక్షేప శక్తులను పేర్కొని ఉన్నట్లు తెలియలేదు.

మాయయొక్క ఈ వ్యత్యయము వారు తెలుసుకోనున్నారని చెప్పడానికి సాక్ష్యాధారాలు లేవు. చదివేవారి శక్తియుక్తులకు, పాండిత్యానికి తగినట్లు కోయిలపాటకు వేదాంతానికి, మిగిలినవాటికి ఇంతటి పొంతన ఉందని చూపించవచ్చునేగాని భారతియార్ ఈ గేయంలో పేర్కొన్న వేదాంత అంతరార్థం ఇదేనని కచ్చితంగా చెప్పడానికి వీలుకాదు.

సముచితమైన అంతరార్థం : భారతిగారి కోయిలపాటకు యుక్తమైనది ఒకటి చూపించడానికి వీలుకాదా? అది సారహీనంగా కూర్చబడిన కవితాగేయమా? అని పరిశీలించినపుడు "వీలవుతుంది" అనే సమాధానం మన మనసులో ఉదయిస్తుంది. కోయిల కవితాశక్తి – కవితా ప్రేయసి అని ప్రతీకలుగా చెప్పడానికి సాధ్యమవుతుంది. కవితాశక్తి కవికి సంబంధించింది. కవితా ప్రేయసి వారికి చెందింది. కవి కవితతో అంతులేని మోహాన్ని పెంపొందించుకున్నాడు. మిగిలిన గేయాలు కూడ ఈ భావావేశాన్ని ఆవిష్కరిస్తున్నాయి.

***ప్రాచీనతా లోపాలను నిర్మూలించి***
***నా నాలుకమీద రసభరితమైన***
***తమిళగేయం ఒక కోటి***
***జాలువారేలా చేయవా!*** [4]

అని వినాయకుని ప్రార్థించడమూ–

***"గేయరచనా సామర్థ్యంతో నేను***
***ఈ విశ్వాన్ని పరిపాలించాలి"*** [5]

---

4. తొ. పా. వి. నా. మాలై–30

5. పైదే. కాణినిలం–3

అని పరాశక్తిని ఒక కుంట పొలం ఇవ్వమని ప్రార్థించే గేయంలోనూ

*సకల కళావల్లీ! తమిళ భాషా సాహిత్యాల వాణీ!*

*నీకొక విన్నపం చేస్తున్నాను;*

*నా నాలుక మీద*

*ప్రవాహంలాగ కురిపించవా!* [6]

అని సరస్వతీదేవిని ప్రార్థించడమూ ఈ వ్యామోహాన్ని చూసి ఆనందించవచ్చు. ఈ మోహావేగమే వారిని,

*"గేయ కవితలాంటి ఒక అద్భుతం*

*ప్రపంచంలో లేదురా!"* [7]

అనీ,

*"కొత్తదనం ఆశ్చర్యమైతే*

*స్వరాలతో సంగమించిన మనోజ్ఞతకు ఈడవుతుందా?"* [8]

అనే గేయం రచించేలా చేస్తోంది.

మాధురీభరితమైన చిత్ర కవిత్వం చెప్పే పండితులకు కురంగన్ ఒక ప్రతీక. ఆవిధంగానే మాడన్ వ్యాకరణాల భారాన్ని మోసే వ్యాకరణ పండితులకు ప్రతీక. వీళ్లిరువురూ కవికి కవిత్వానికి మధ్య పోటీపడే కృత్రిమరూపాలు. తమిళ కవిత్వం అనే నాయిక సుదీర్ఘకాలం తన నాయకుని ఎడబాసి ఉంది. నిజమైన కవి దగ్గర ప్రాణానికి ప్రాణంగా తన ప్రేమను కలిగి ఉంది. వ్యాకరణ పండితులకు కవిత్వానికి వ్యాకరణరీతిగా ఒక విధమైన సంబంధం ఉంది. ఛందో లక్షణాలను, అలంకార శాస్త్రాన్ని,

6. పైదే. శక్తి–5

7. కుయిల్ పాట్టు : కుయిలుం మాడుం. పాదం – (96)

8. పైదే. పాదాలు (97–98)

సంగీత విభాగానికి చెందిన గ్రంథాలను పెట్టుకొని వర్తకం సాగించేవారు కదా? కవిత్వానికి ఈ పండితుని దగ్గర ఒక ప్రత్యేకమైన సానుభూతి ఉంది. 'వరకవి' అనగా చిత్ర కవిత్వాన్ని రచించేవారు కవిత్వంలో పటాటోపం చూపిస్తూ హక్కును కోరుతారు. వీరి అహంకారంలో మైమరిచి కవిత్వం తల్లిదండ్రులు వీరికి వివాహం చేయడానికి సమ్మతించారు. కురంగన్, మాడన్ – చిత్రకవి, వ్యాకరణ పండితుడు – కోయిల దగ్గర దొంగనాటకం ఆడుతారు. నిజమైన కవి దీన్ని చూసి హృదయంలో కుమిలిపోతాడు. కోపంతో ఉప్పొంగిపోతాడు. నిజం బయట పడుతుంది. కవితా కన్య కవితో ఐక్యమైపోతుంది. 'కోయిల పాట' అనే అద్భుతమైన కథా కావ్యం ఆవిర్భవిస్తుంది.

ఇలాంటి అంతరార్థంతో కూడిన వస్తువు కవిత్వంలో ఇమిడి ఉన్నట్లయితే కవి దీన్ని బహిరంగంగా చెప్పకపోయినప్పటికీ ప్రతీకగా కూడ ఎందుకు చూపించలేదు? అనే ప్రశ్నకు సమాధానం దొరికింది. దీనిని బహిరంగంగా పేర్కొన్నట్లయితే కవి గొప్పతనం వ్యాపార ప్రకటనగా మారిపోతుంది. కావ్య మాధుర్యం కూడ తగ్గిపోతుంది. కల్పనకు ఆధారంగా ఉన్న విషయాన్ని చెప్పాలని కవికి ఆకాంక్ష ఉన్నప్పటికీ చెప్పడంలో ఒక విధమైన సంకోచం. ఇది వాస్తవంగా ఉన్నట్లయితే కోయిల పాట చివరి మూడు పంక్తులలో సంకేతంగా స్పష్టమై ఉండేది. దీనికి దృష్టాంతంగా భారతి మాటల్లో ఏదైనా ఆధారం లభిస్తుందా? అని చూద్దాం.

*"వారాయ్! కవిదైయామ్ మణిపెయర్ కాదలి!*
*పణ్ణాల్ పన్మది ఆండుపల కళిందన*
*..........................................*

*నిన్నైయే వేణి నెడునాళ్ పోక్కినేన్"* [9]

భారతిని ఉద్యానవనంలో ఆకర్షించినవి ఇవి అనేది ఈ గేయంలో ప్రస్తావించబడింది. కవితను స్త్రీగాను, ప్రేయసిగాను, కోయిలను గంద్రగొంతు కలిగినదానిగాను వర్ణించాడు కవి. కవితాలలామ కంటిచూపులతో ఉపమించదగిన పుష్పాలు ఏవీ లేవు. మధురమైన కవితాక్షరాలతో సమానమైన చెలమనీరు లేదు. అయినప్పటికీ సంగీతం అతని హృదయాన్ని ఆకర్షించింది. కోయిల బొంగురు గొంతు వారి మనసును చూరగొన్నది. అందువల్ల ఈ కల్పనా కోయిల, కోయిలపాటకు తప్పని సరియైన ఆధారంగా రూపొందింది. అద్భుతమైన సజీవమైన 'కోయిల పాట' ఈ నేపథ్యం నుండి ఆవిర్భించింది. ఈ గేయంలో భారతిగారి అంతర్గత స్వరాన్ని వింటున్నాము. ప్రపంచమే వింటూ ఉంది. ఆత్మ సత్యంవైపుగా సౌందర్యం వైపుగా సాగే తెగువను గేయంలో చూస్తున్నాము. కవిత కవిత కోసమే అనే ధోరణి ఇక్కడ కనిపిస్తున్నది. ప్రచారమో, లక్ష్మమో, బోధించడమో ఇక్కడ కనిపించదు. నిజమైన కవిత కుండవలసిన లక్షణంగా ప్రపంచ వైజ్ఞానిక పరిశోధకులు ఈ ఉన్నతమైన ధర్మాన్నే అనుసరిస్తున్నారు.

"వివరించడానికి వీలుకాని అద్భుత స్త్రీగా – అందమైన యువతిగా – మారి నిలబడిన కోయిల అందాలను ఏవిధంగా తమిళంలో గానం చేస్తాను?" అని తపించిన తమిళకవి భారతియార్. విద్యావంతులకు వారు చెప్పే మాటలు ఇవి:

*" ............. ........ .......... కవితా ఫలం పిండిన*

---

9. త. పా. కవిదై కాదలి. (ఒక ప్రచురణలో 'ఇదు కవితాదేవి అరుళ్ వేండల్' అనే శీర్షిక కింద ఉంది.

*రసంలాగ పలురకాలైన నాట్య, సంగీతాల సారమంతా*
*కలిపి, దానిలో అమృతాన్ని రంగరించి*
*ప్రేమ అనే ఎండలో కాగబెట్టి చేసిన గడ్డతో*
*మాధవుని శరీరాన్ని నిర్మించాడు*
*బ్రహ్మదేవుడు అని అంటాను"*[10]

ఈ గేయంలో "దక్షిణ పొదిగై పర్వత మునివరేణ్యులు" ప్రత్యక్షమవుతారు. వారే కోయిలకు దాని పూర్వజన్మ వృత్తాంతాన్ని చెబుతారు. దాని ప్రేమైక ప్రియుని – ప్రియమైన నాయకుని పొందడం గురించి అనుగ్రహించినది కూడా వారే. పొదిగై పర్వతం మీద ఆవాసమున్న అగస్త్య మునివరేణ్యులు! పొట్టిఋషి' అని తమిళులచే ప్రశంసింపబడినవాడు. వారు పురాణ సంప్రదాయ తమిళ కవిత్వానికి సంప్రదాయంలో తగులుకొని తపించే తమిళ కవిత్వానికి మారణాస్త్రంగా నిలబడ్డారు. కోయిలపాటలోని అంతర్గత వస్తువునకు, పొట్టి సన్యాసి అగస్త్యుడు మరొర సాక్ష్యంగా ఉంటాడు. ఈ విషయాలను అన్నీ మనసులో పెట్టుకొని ఒకే గుక్కలో కవితను పెక్కుసార్లు పఠిస్తే ఈ కావ్యం యొక్క గొప్పదనం మరింత పెరగడానికి అవకాశం ఉంది.

10. కుయిల్ పాట్టు : కుయిలిన్ ముఱ్పిఱప్పు వరలాఱు – పాదాలు. (241–5)

# అధ్యాయం - 8

## కోయిల పాట - ఒక మూల్య నిర్ధారణ

అంతరార్థం : "కోయిల పాట" అన్ని విధాలుగా స్వతంత్రమైన ఒక అద్భుత కావ్యం. భారతిగారు రచించిన సుదీర్ఘమైనవ ఒకే ఒక కావ్యం ఇదే. వీరి శక్తి సామర్థ్యాలలో ఇమడ్చడానికి వీలుకాని స్వతంత్ర కావ్యం ఇది. ఇందులో భారతిగారి కల్పనాశక్తి రెక్కలు విప్పి విహరిస్తుండడం చూడవచ్చు. ఈ కోయిలయొక్క అద్భుతమైన ప్రేమకథ,

*"పూర్వం కవిత్వం పిచ్చి పట్టగా స్మృతిహీనుడై*
*పట్టపగలే కవిగారికి కనిపించిందట*
*సుదీర్ఘమైన కలలో సంఘటనలు - "*[1]

చూసింది మోహనాకార దృశ్యంతో కూడిన కల. ఈ స్వప్న ఫలితమే 'కోయిలపాట' అనే అద్భుత సృష్టి.

ఎన్ని అడ్డంకులు ఎదురైనప్పటికీ నిజమైన ప్రేమ వాటినన్నింటినీ నిర్మూలించి విజయం సాధిస్తుంది అన్నదే స్వప్నంలో కనిపించిన ఈ ప్రేమకథ మనకు అందించే సందేశం. "ప్రేమమార్గమే ఎగుడు దిగుళ్లతో కూడింది అంటారు" అని కవిగారు చెప్పిన సందేశం. "నిజమైన ప్రేమగుర్తులు ఎప్పుడూ సూటిగా ప్రయాణం చేయవు. (The course of true love never runs smooth)" అనే ఆంగ్ల నాటకాచార్యుడు షేక్స్పియర్ సూక్తిని గుర్తుకు తెచ్చేదిగా ఉంది. అయినప్పటికీ ప్రేమయొక్క శాశ్వత విజయాన్ని గురించి ఏమాత్రమూ సందేహించ వలసిన అవసరం లేదనేది ఈ గేయాన్ని

---

1. కుయిల్ పాట్టు. 1. కుయిల్-పాదాలు. 22-24

